## ఇందులోని గ్రంథముల అనుక్రమణిక

# లఘు గ్రంథములు

## ద్వితీయ భాగము

ఇందులో :



"కళాప్రపూర్ణ" డా. పం. గోపదేవ్

ప్రకాశకులు:
ఆర్య సమాజము, కూచిపూడి-522 313

అంబా దర్శన గ్రంథమాల - 2000 ప్రతులు



శ్రావణి 1993
వెల : 8-00

ప్రతులకు:

1. ఆర్యసమాజము, కూచిపూడి-522 313. (తెనాలి తాలుకా)

2. మాశెట్టి వేంకటేశ్వర రావు, 3-3-738,
కంచరి బజారు, సికింద్రాబాదు-3.

ముద్రణ:

SRISHMA IMPRESSIONS, Secunderabad-3.

# అంబా దర్శన గ్రంథమాల

మహారాజపోషకులు:- రూ.15,000లు అంతకుపైన నిచ్చువారు
రాజపోషకులు:- రూ.10,000లు అంతకుపైన నిచ్చువారు
పోషకులు:- రూ.5,000లు అంతకుపైన నిచ్చువారు

మహారాజపోషకులు:

1. శ్రీమతి కొత్తపల్లి యామినీదేవి — కూచిపూడి
2. శ్రీ బెల్డె జగదీశ్వరయ్యశ్రేష్ఠి — సికిందరాబాద్
3. శ్రీ మాశెట్టి వేంకటేశ్వర రావు — సికిందరాబాద్
4. శ్రీ కొసరాజు మాధవయ్య — తెనాలి
5. డా.శ్రీ వై.వి. సుబ్బారావు, సరోజనీదేవి — గుంటూరు
6. శ్రీ గ్రంధి కామరాజు — విజయవాడ
7. శ్రీ కావూరి జయచంద్రవర్మ — కూచిపూడి
8. శ్రీ చదలవాడ అచ్చేశ్వరరావు, రాజ్యలక్ష్మి — కూచిపూడి
9. శ్రీమతి చదలవాడ లక్ష్మమ్మ — కూచిపూడి
10. శ్రీ మట్టెడ్డి గురవారెడ్డి — తూములూరు
11. శ్రీ చంద్రయ్య & సన్స్-అలవాల — సికిందరాబాద్
12. శ్రీ యం.యస్. బాలకృష్ణ, సుధాకర్ — సికిందరాబాద్
13. శ్రీ ఉప్పల రాజేశ్వర రావు — సికిందరాబాద్
14. శ్రీ కొసరాజు తిరుమలరావు, సూర్యకుమారి — కురుమద్దాలి
15. శ్రీ గజ్జె సుబ్బారావుగుప్త, నాంచారమ్మ — గుంటూరు
16. శ్రీ జక్కిడి సీతారామరెడ్డి — సికిందరాబాద్
17. శ్రీ తుమ్మల వల్లభయ్య — కూచిపూడి
18. శ్రీ నోముల స్వామిదాస్, శ్రీ శ్రీపతి వెంకటరావు — సికిందరాబాద్
19. శ్రీ వాసంశెట్టి రామకృష్ణారావు — వలసపాకల
20. శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణ — గుంటూరు

రాజపోషకులు:

| | | |
|---|---|---|
| 1. | శ్రీ కావూరి సంగయ్య | కూచిపూడి |
| 2. | శ్రీ జె. వెంకటరావు | వరంగల్ |
| 3. | శ్రీ బి. శంకరలాల్ | హైదరాబాద్ |
| 4. | శ్రీ యలవర్తి రామకోటయ్య, సీతారత్నం | కూచిపూడి |
| 5. | శ్రీ కుమ్మరి పోచయ్య | సికిందరాబాద్ |
| 6. | శ్రీమతి బొర్రా వేంకటరత్నమ్మ | కూచిపూడి |
| 7. | శ్రీ యం. భూపతిరావు, ప్రజ్ఞాపురం | హైదరాబాద్ |
| 8. | శ్రీ సరిదె శ్రీనివాసరావు, కనకలక్ష్మి | రేలంగి, గోదావరి(జి) |
| 9. | శ్రీ వి.యస్.గుప్త | కొత్తగూడెం |
| 10. | కీ.శే. మలిపెద్ది సిద్దయ్య ధర్మపత్ని చంద్రమ్మ | మర్మాముల |
| 11. | శ్రీమతి చదలవాడ రాజ్యలక్ష్మి | కూచిపూడి |
| 12. | శ్రీ తలశిల శ్రీరాములు | నాగాయలంక |

పోషకులు:

| | | |
|---|---|---|
| 1. | శ్రీ మేకా రామకృష్ణయ్య | కూచిపూడి |
| 2. | శ్రీ జాస్తి వెంకటప్పయ్య, తులశమ్మ | కూచిపూడి |
| 3. | శ్రీమతి దాసరి రామకోటమ్మ | కూచిపూడి |
| 4. | శ్రీమతి కన్నెగంటి శైలసుత నవరత్నకుమారి | కూచిపూడి |
| 5. | శ్రీ కోట్ల రమణారెడ్డి | సికిందరాబాద్ |
| 6. | శ్రీ పోలం వీరయ్య సోదరులు | సికిందరాబాద్ |
| 7. | శ్రీ కోడూరి సుబ్బారావు | సికిందరాబాద్ |
| 8. | శ్రీ దుర్గా సత్యనారాయణ, కృష్ణవేణి | తణుకు |
| 9. | శ్రీ కావూరి శివరామయ్య | మోపిదేవి |
| 10. | శ్రీ గడ్డిపాటి వేంకట కృష్ణయ్య | అమృతలూరు |
| 11. | శ్రీ చుండూరి శ్రీహరిరావు, శాంతకుమారి | గుంటూరు |
| 12. | శ్రీ మల్లాది సూర్యనారాయణ మూర్తి | రాజంపేట (తూ.గో.) |

ఓమ్

# వేదాంత దర్శనము-అపశూద్రాధికరణము

శ్రీ శంకరాచార్యులు

భారతీయ దర్శనములలో వేదాంత దర్శన మొకటి. దానిని ఉత్తర మీమాంస యనియు, బ్రహ్మసూత్రములనియు నందురు. ఇయ్యది వ్యాస ముని ప్రణీతము. గ్రంథము సూత్ర రచనలో నున్నది. సాంప్రదాయకులచే జెప్పబడు ప్రస్థానత్రయములో నియ్యది యొకటి. దక్షిణదేశపు సంప్రదాయ విదులు గీత, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు నను మూడు గ్రంథములను ప్రస్థానత్రయ మందురు. అద్వైతాది సంప్రదాయ ప్రవర్తకులయిన శ్రీమచ్ఛంకర భగవత్పాదులు మున్నగు నాచార్యులీ మూడు గ్రంథములకును భాష్యములు రచించి యున్నారు. ఆ యా సంప్రదాయములకు చెందిన శిష్ట పురుషు లెల్లరు నీ గ్రంథములపై నాచార్యులచే రచియింపబడిన భాష్యములను జదువని వారికి అనగా ప్రస్థానత్రయమును జదువనివారికి మోక్షప్రాప్తి లేదనియే యెంచుచున్నారు. దీనిం బట్టి మోక్షాపేక్ష గలవారికి ప్రస్థానత్రయమని పిలువబడు నీ గ్రంథములు జదువుట యెంత ముఖ్యమో పాఠకు లూహింప గలరు. అందునను బ్రహ్మసూత్రములు, వానిపై నాచార్యులచే వ్రాయబడిన యాచార్యుల భాష్యములును మిక్కిలి ముఖ్యములు. బ్రహ్మసూత్రములపై వ్రాయబడిన భాష్యములలో శారీరకభాష్య మత్యంతము ప్రసిద్ధము. అయ్యది శ్రీ శంకరస్వాములచే వ్రాయబడినది. వారికి తరువాత శ్రీ రామానుజస్వాములు మున్నగువారును శంకరస్వాములు వ్రాసినట్లే భాష్యములను బ్రహ్మసూత్రములకు వ్రాసియున్నారు. కాని శ్రీ శంకరుల భాష్యము తక్కిన భాష్యములకు మార్గదర్శకముగా కనబడును.

శ్రీ శంకరులు వేదాంతదర్శనములోని ప్రథమాధ్యాయ తృతీయ పాదమునకు చెందిన 34, 35, 36, 37, 38 సంఖ్యగల యైదు

సూత్రములను ఒక యధికరణముగా విభజించి "అపశూద్రాధికరణము" అని పేరిడి యున్నారు. ఈ యైదు సూత్రములకు భాష్యమును రచియించి, యందు శూద్రులకు శాస్త్రముంజదువు నధికారములేదని సిద్ధాంతముచేసియున్నారు. ప్రస్తుత మీ లేఖయందు శ్రీ శంకరస్వాములచే జేయబడిన యా సిద్ధాంతములోగల యౌచిత్యమునుగూర్చి విచారింపబడును. పాఠకులు పరిశీలింతురుగాక!

ముందుగా అపశూద్రాధికరణమని పిలువబడు నాయైదు సూత్రముల నిట పొందు పఱచుచున్నాడ.

(1) "శుగస్య తదనాదర శ్రవణాత్ తదాద్రవణాత్ సూచ్యతే హి"1.3-34

అర్థము : ఆ యనాదర శ్రవణమువలన, దానిచే బరువిడినందునను నతని శోకము సూచింపబడుచున్నది.

(2) "క్షత్రియత్వావగతేశ్చోత్తరత్ర చైత్రరథేవ లింగాత్" 1. 3-35

అర్థము : మఱియొకచోనున్న చైత్రరథ లింగమువలన, క్షత్రియత్వము ప్రాప్తించినందునను.

(3) "సంస్కారపరామర్శాత్ తదభావాభిలాపాచ్చ" 1. 3-37

అర్థము : సంస్కారమును పరామర్శించుట వలనను, దాని యభావము చెప్పబడుటవలనను.

(4) "తదభావనిర్ధారణే చ ప్రవృత్తేః" 1. 3-3

అర్థము : దాని యభావము నిర్ధారణముకాగా ప్రవృత్తి కలిగినందునను.

(5) "శ్రవణాధ్యయనార్థ ప్రతిషేధాత్ స్మృతేశ్చ"

1. 3-38

అర్థము : శ్రవణము, అధ్యయనము, అర్థము నిషేధించుటవలన, స్మృతియందు చెప్పబడినందువలనను.

పై పంక్తులలో సూత్రములు, సూత్రములలోని శబ్దార్థములు పాఠకులు జదువగలరు. ఈయైదు సూత్రములకు శ్రీ శంకరులు అపశూద్రాధికరణము అని పేరుపెట్టియున్నారు. బుద్ధిమంతులకు శంకరస్వాములు

చేసిన నామకరణములలోనే శూద్రులను ఏదోయొక విషయమునుండి తొలగింప నెంచినట్లు పొడకట్టకపోదు. ఈ సూత్రముల కిట్టి పేరు పెట్టి, వాని నన్వయించుచు శూద్రులకు వేదశాస్త్రములు జదువ నధికారము లేదని అచార్యులు నిర్ణయించియున్నారు. ఇట్టి నిర్ణయములే వేదవిధులుగా నంగీకరించి యాచార్యులచే నడపబడిన సంప్రదాయముల ననుసరించు నేటి విద్వాంసులు, అవిద్వాంసులు నయిన బ్రాహ్మణబ్రువులెల్లరు శూద్రులకు వేదములను వినుటకుగాని, ఉచ్చరించుటకుగాని, వేదనామక గ్రంథములను స్పృశించుటకుగాని అధికారము లేదని నుడువుచున్నారు. అబ్రాహ్మణుల యిండ్లలో జరుగు గృహ్యసంస్కారములను కూడ నవైదికముగ నపభ్రంశముగ జరుపుచున్నారు. శూద్రులకు విద్యాదానము చేయుటకును వెనుకాడుచున్నారు. భారతమున నిట్లు అవిద్యావ్యాప్తికి వీరు కారకులగుచున్నారనుట యనుచితము కాదు.

వాస్తవమున నుపర్యుక్త సూత్రములను బరికించిన నందు శూద్ర పదముకాని, అయ్యది జాతి శూద్రులకు బోధకమనికాని, అట్టి జాతి శూద్రులకు వేదశాస్త్రములు చదువరాదని చెప్పుటకు తగిన యాధారములుకాని యెక్కడను మచ్చునకైనను నగపడవు. అయినను బలవంతముగ నిట ప్రసక్తికలిగించి శూద్రులకు వేదశాస్త్రములు వినుటకును, చదువుటకును, తదర్థముల నాచరించుటకును అర్హత - అధికారము లేదని శ్రీశంకరస్వాములు నిర్ణయించియున్నారు. ఈ నిర్ణయము మిక్కిలి యనుచితము, పక్షపాతపూర్ణము, రాగద్వేషాది ప్రయుక్తము నని తెలుపుటకే నే నీ పంక్తులనిట వ్రాయుచున్నాడ. విజ్ఞు లిందలి గుణదోషములను గుర్తింతురు గాక!

ఈ యపశూద్రాధికరణరచనకు పూర్వ మీ యధ్యాయము నందే (హృద్యపేక్షయా తు మనుష్యాధికారత్వాత్, 1-3-25) అను సూత్ర భాష్యమునందు, (శాస్త్రం హి అవిశేషప్రవృత్తమపి మనుష్యానేవాధికరోతి) 'శాస్త్రము విశేషించి యొకరికని ప్రవృత్తముకాకున్నను మనుష్యాధికారకమే' యని శంకరాచార్యులు వ్యాఖ్యానించి యున్నారు. సూత్రమునందును 'మనుష్యాధికారత్వాత్' అను పదము స్పష్టముగా కనబడుచునేయున్నది. అందువలన శంకరస్వాము లిట్లు వ్రాయుటయు

నుచితమే. ఇట శాస్త్రమనగా వేదశాస్త్రము లనియే శంకరుల యభి
ప్రాయ మనియు పాఠకులు గుర్తింతురుగాక! (కారణమేమన:- ఆచార్యులు
శాస్త్ర యోనిత్వాత్ 1-1-3) అను సూత్రభాష్యమునందు ('మహతః
ఋగ్వేదాదేః శాస్త్రస్య అనేక విద్యాస్థానోపబృంహితస్య ప్రదీపవత్ సర్వా
ర్థావద్యోతినః, సర్వజ్ఞకల్పస్య యోనిః కారణం బ్రహ్మ' శాం.భా.) 'గొప్పది
యగు ఋగ్వేదాదిశాస్త్రము అనేక విద్యాస్థానోపబృంహితము, ప్రదీపము
వలె సర్వార్థములను ప్రకాశింపజేయునది, సర్వజ్ఞుడగు పరమేశ్వరునితో
తుల్యము' నని యిట శాస్త్రపదముచే వేదములనే గ్రహించియున్నారు.
అట్టి వేదములకు కర్తయు పరబ్రహ్మ పరమేశ్వరుడనియే యాచార్యు
లంగీకరించుచున్నారు. అందువలననే (శాస్త్రస్య యో యోనిః కారణం
బ్రహ్మ) 'శాస్త్రమునకు యోని - ఉత్పత్తిస్థానము, కారణం - నిమిత్త
కారణము బ్రహ్మమనియు స్వయముగా నుడివియున్నారు. ఇట్లు వేద
శాస్త్రము లీశ్వరీయములు కాబట్టి యవి ప్రాణిమాత్రము నుద్దేశించి
ప్రవృత్తములగుట యుక్తిసంగతమే. విశేషించి యెవరికో యొకరికి, లేక
కొందఱకు మాత్రమే యనిచెప్ప వలనుపడదు. అందువలన నెల్లరకు
నవిశేషములే - సమానములే. ప్రాణులలో వ్యక్తవాక్కులగు మానవుల
కందఱకు నా శాస్త్రములం దధికార మున్నదని శంకరాచార్యులు భాషిం
చుట మిక్కిలి సుభాషితమనియే చెప్పవలసి యున్నది.

కాని, ఆ శంకర భగవత్పాదులే పది సూత్రములకు తరువాత
స్వయముగా (శుగస్య తదనాదర శ్రవణాత్) అను సూత్రమును వివరిం
చుచు నట శూద్రులకు శాస్త్రమునందధికారము లేదని నిశ్శంకముగా
నిర్ణయించుచున్నారు. ఈ నిర్ణయమును చూచినపుడు ఆచార్యు లిట్టి
స్వవచనవ్యాఘాతమున కేల బూనుకొనియుందురా! యని యాశ్చ
ర్యము గొలుపకపోదు. ఈ ప్రసంగమున శూద్రులనగా నాచార్యులు
జాతి శూద్రులు (శూద్రస్త్రీయందు శూద్రునకు బుట్టినవారు) అని
భావించు చున్నారు. జాతిశూద్రులు మనుష్యులు కారా? మనుష్య
మాత్రుల కధికారమున్న శాస్త్రమున శూద్రుల కేల యధికారముండ
రాదు? ఈశ్వరీయములగు వేదములనుండి వారెట్లు వంచింపబడుదురు?
వ్యాసుడు తనచే రచియింపబడిన సూత్రమునందు (మనుష్యాధికార

త్వాత్) మనుష్యమాత్రునకధికారమున్నదని కంఠోక్తిగా చెప్పిన ట్లంగీకరించిన శంకరస్వాము లిట శూద్రులకు శాస్త్రమున నధికారము లేదనుట యెట్లు సంగతమగును? ఈ నిర్ణయ మనార్షము, అవైదికము, అయౌక్తికము, పక్షపాత పూర్ణము, రాగద్వేషప్రయుక్తము నని వ్రాయుచున్న నాధార్ష్ట్యమును పాఠకులు మన్నింతురు గాక!

అపశూద్రాధికరణమని పేరిడిన సూత్రములలో నైదింటి యందును నెక్కడను శాస్త్రమున శూద్రున కధికారము లేదని చెప్పుటకు తగిన శబ్దములుకాని, ఆధారములుగాని లేకున్నను శంకరస్వాములు, రామానుజ స్వాములు వారికి తరువాత వచ్చిన వారి యనుచరులు నెల్లరు నుపర్యుక్త సూత్రములను వివరించుచు, బలవంతముగా నిట శూద్రప్రసక్తిని కలిగించి వారికి శాస్త్రమును నిషేధించియున్నారు. ఈ నిర్ణయము చేయుటకు శంకరస్వాములు ఎంతగానో ప్రయాసపడియున్నారు. ఇక వారి యనుచరులు స్వాముల నిర్ణయమును బలపఱచుటకు మిథ్యాకల్పనలను కూడ చేసియున్నారు. ఇట్టి స్థలములను బాగుగ చూచినపుడు శాస్త్రములందాచార్యులు, సాంప్రదాయకులు నెన్నో కుట్రలు పన్ని మానవులలో కొందఱను జ్ఞానమునకు దూరముగా నుంచ యత్నించినట్లు స్పష్టము కాకపోదు.

శూద్రులకు వేదశాస్త్రములు చదువు నధికారము లేదని సిద్ధాంతము చేయుట కీ యపశూద్రాధికరణమునందు ఛాందోగ్యోపనిషత్తునుండి రెండు ప్రసంగముల నుదాహరించి యున్నారు. అందొకటి జానశ్రుతికి చెందినది; రెండవది జాబాలి సత్యకామునికి. జానశ్రుతి, సత్యకాముడు నను వీరిరువురును జన్మతః శూద్రులు కారనియు, జానశ్రుతి జన్మతః క్షత్రియుడనియు, సత్యకాముడు జన్మతః బ్రాహ్మణుడనియు సాధించి, యందువలన వారికి బ్రహ్మవిద్యయందు నధికారము కలిగినది. కావున జాతిశూద్రులకు వేదము చదువు నధికారము లేదని సిద్ధాంతీకరించిరి.

ఇక్కడ పాఠకులు గమనింపదగిన విషయము లివి. ఒకటి జానశ్రుతి జన్మతః క్షత్రియుడా? కాడా? రెండవది సత్యకాముడు జాతి బ్రాహ్మణుడా? కాడా? మూడవది వీరికి బ్రహ్మవిద్యయం దధికారము కలుగుటకు కారణము జన్మమా? లేక గుణకర్మ స్వభావములా? నాలుగవది వీరికి జన్మము కారణముగా విద్య లభించిన లభించునుగాక!

వీరికి విద్యయం దధికారము గలుగుట జాతిశూద్రుల శాస్త్రాధికారము నెట్లు నిషేధింపగల్గును? ఈ విషయములు పాఠకులు బాగుగ గమనించుట కనువగునట్లు పైజెప్పిన రెండు ప్రసంగముల నొకదాని తరువాత మఱియొకటి యుపనిషత్తులో నున్నట్లు ఇక్కడ వ్రాయుచున్నాడ. వాని జదివి పాఠకులు శంకరస్వాముల నిర్ణయములోగల గుణదోషములను; ఔచిత్యానౌచిత్యములను బాగుగ గుర్తింపగలుగుదురుగాక!

ఛాందోగ్యోపనిషత్తు చతుర్థ ప్రపాఠకము 1, 2, 3 ఖండములలో జానశ్రుతి వృత్తాంత మిట్లున్నది:-

ప్రాచీనకాలములో జానశ్రుతి యను వాడొకడుండెను. అతడు పుత్రపౌత్రులు గలవాడై పౌత్రాయణుడనబడెడివాడు. అతడు శ్రద్ధాలువు; మిక్కిలిదాత; అన్నప్రదాత; అతిథులు నివసించుటకు, అన్నపానములు గ్రహించుటకు వీలుగ ననేక సత్రములు కట్టించినవాడు.

ఒకనాటి రాత్రి కతిపయ పరమహంస లా జానశ్రుతి ప్రాసాదమున కేతెంచిరి. అందొకరు మఱియొకరితో 'భల్లాక్ష! జానశ్రుతి యశస్సు ద్యులోకమువలె నంతట వ్యాపించుచున్నది. దాని నుల్లంఘింపకుము. ఆ జ్యోతి నిన్ను దహింపకుండునుగాక' అనెను. అదివిని ఎవనిని 'నీ వింతగా పొగడుచున్నావో అతడేమి రైక్వుడా? రైక్వునకు తెలిసిన రహస్యము నెఱిగినవాడే తెలిసినవాడు' అని రెండవ పరమహంస సోపహాసముగా బదులు చెప్పెను. జానశ్రుతి యాసంవాదమును విని మఱునాడు రైక్వ ఋషిని వెదక తనసారథిని బంపెను. అతడన్వేషించివచ్చి 'రైక్వమహర్షిని జూచి వచ్చినాడ. అతడొక బండినీడను గూర్చుండి యొడలి దురదను బాపుకొనుటకు గోళ్ళతో గోకికొనుచున్నాడు' అని జానశ్రుతికి బదులు చెప్పెను.

అంతట నా జానశ్రుతి యాఱువందల గోవులను, నొకరత్నహార మును, కంచరగాడెదలం బూన్చిన రథమును తీసికొనిపోయి రైక్వున కర్పించి యుపదేశింపుడని యర్థించెను. రైక్వుడతనిం జూచి 'అరే! శూద్ర! యివి యన్నియు నీయొద్దనే యుంచుకొనుము' అనెను. జానశ్రుతి మరల నొక వేయిగోవులను, రత్నహారమును, రథమును, తన పుత్రికను గొనిపోయి ఋషికి నర్పించి యుపదేశము నర్థించెను. అంతట

నారైక్వుడు రెండవసారికూడ 'ఓ శూద్ర! నీవు తెచ్చిన గోవులకు నేనే మియు పలుకువాడ గాను. కాని యీ కన్యకమర్యాదను గాపాడవలసి వచ్చుటచే నేను మాటాడవలసి వచ్చినది' అని యతనికి సంవర్గవిద్య నుపదేశించియుండెను.

జానశ్రుతి వృత్తాంతమిది. శంకరస్వామి లీ ప్రసంగమునుదాహరించి శూద్రులకు వేదశాస్త్రములందధికారములేదని నిర్ణయించియున్నారు. ఈ ప్రసంగము జదివినవారి కిందు శూద్రులకు శాస్త్రాధికారమును నిషేధిం చుటకు గల కారణము దురూహ్యముగా దోచును. ఇంతేగాక రైక్వుడు జానశ్రుతిని రెండు పర్యాయములు శూద్ర! యని సంబోధించి తరు వాత సంవర్గవిద్యను బోధించియున్నందునను, ఆసంవర్గవిద్య బ్రహ్మవిద్య యగుట వలనను శూద్రులకు బ్రహ్మవిద్యయం దధికారమున్నట్లు స్పష్ట మగుచున్నది. కాని శంకరాచార్యు లిందుకు విపరీతముగ, రైక్వునిచే జానశ్రుతి శూద్ర! యని సంబోధింపబడినప్పటికిని నతడు జాతిశూద్రుడు కాడనియు, నతడు వాస్తవమున జాతిక్షత్రియుడనియు చెప్పి, యందువల ననే రైక్వుడు జానశ్రుతికి సంవర్గవిద్య నుపదేశించి యున్నాడు; కావున జాతిశూద్రునకు శాస్త్రమున నధికారము లేదనుచున్నారు.

చూచితిరా! ఆచార్యుల సాధన! జానశ్రుతి యితివృత్తమును తెలుపు ప్రసంగములో నెటనైన నతని జాతిక్షత్రియత్వముమ దెలుపు పదము లున్నవా? లేవు. క్షత్రియుడని తెలుపు పదములు లేకపోగా నతడు శూద్రుడనుటకు తగినట్లు రైక్వు డతనిని రెండు పర్యాయములు శూద్ర! అని వ్యవహరించియున్నాడు గదా! అతడెట్లు క్షత్రియుడయ్యెను స్వామీ? యని యాచార్యులను ప్రశ్నించిన వారేమందురో చూడుడు. 'ప్రసంగములో క్షత్రియత్వమును బోధించు పదములులేకున్నను జానశ్రుతి క్షత్రియుడే యగును. కారణమేమనః- ఈ జానశ్రుతికి అభిప్రతారి యను నొక క్షత్రియునితో సంబంధమున్నట్లు ఛాందోగ్యములోని తరువాత ప్రసంగ మును జదివిన బోధపడగలదు. అనగా అభిప్రతారి యనునొక క్షత్రియుడు సంవర్గవిద్యను నేర్చుకొనెను. ఆ సంవర్గవిద్యనే జానశ్రుతియు నేర్చుకొని యున్నాడు. ఈ యిరువురు నేర్చినది యొకేవిద్య కాబట్టి యా విద్య ద్వారా వీరి కిరువురకును సంబంధ (బాదరాయణ సంబంధ) మేర్పడు

చున్నది. ఈ విధముగ క్షత్రియుడయిన అభిప్రతారితో సంబంధముండుట వలన (ప్రసంగమునందు జానశ్రుతి క్షత్రియత్వమును దెలుపు పదములు, ప్రమాణములు లేకున్నను) నతడు జాతిక్షత్రియుడే కాని శూద్రుడు కాడు' అని ఆచార్యులు భాష్యమున వ్రాసియున్నారు. శంకరస్వాములు ప్రదర్శించిన యుక్తి యెంత ప్రబలముగా నున్నదో చూడుడు! అభిప్రతారి చదివిన విద్య జానశ్రుతి చదివియున్నాడు; కావున; అభిప్రతారి క్షత్రియుడైనందున జానశ్రుతియు జాతిక్షత్రియుడే. ఒకేవిద్య నిరువురు చదివినారు. అందులో నొకడు క్షత్రియుడు కావున రెండవ వాడును క్షత్రియుడే. పాపము! స్వాముల కింతకంటె వేఱొక ప్రమాణమేమియు లభియింపదయ్యె! ఇక వేమిచేయగలరు? యేనకేన ప్రకారేణ జానశ్రుతిని క్షత్రియుడని సాధింప వలసి వచ్చినది. లేకున్న శూద్రులకు శాస్త్రమున నధికారము లభింపగలదేమో? పుట్టిమునుగునేమో? ఎటులైనను ఈ ముప్పునుండి తప్పించి శాస్త్రము నొడ్డున వేయవలసిన భారమాచార్యులపై బడినది.

పోనిండు; అభిప్రతారియైనను జాతిక్షత్రియుడే యని ఉపనిషత్తులో స్పష్టముగా వర్ణింపబడినదా? అదియును లేదు. అందువలన 'నభిప్రతారి క్షత్రియు డెట్లయ్యెను?' అని శంకరస్వాముల నడిగిన వారందులకేమనిరో చూడుడు. (అథ హ శౌనకం చ కాపేయ మభిప్రతారిణం చ కాక్షసేనిం పరివిష్యమాణౌ బ్రహ్మచారీ బిభిక్షే. ఛాం. 4.3.5) "శునకుని పుత్రుడు కాపేయుడు, కక్షసేనుని కొడుకు అభిప్రతారియు నిద్దఱు నొకచో భోజనార్థమై కూర్చుండగా నొక బ్రహ్మచారి వారిని భిక్షనడిగెను" అను ప్రసంగము నుదాహరించి స్వాము లిట్లనుచున్నారు. కాపేయుడు యాజకుడు పురోహితుడు. అభిప్రతారి యతనితో భోజనార్థమొకపంక్తిలో కూర్చుండెను. అట్టి సమయమున నొక బ్రహ్మచారి వారిని భిక్షనడిగెను. కావున, అభిప్రతారి క్షత్రియుడై యుండవలయును. కాకున్న నతడు బ్రాహ్మణుడైన కాపేయునితో భోజనార్థమెట్లు కూర్చుండగలడు? బ్రహ్మచారి యతని నెట్లు యాచింపగలడు? బ్రహ్మచారి బ్రాహ్మణుడై యుండవలయును. బ్రాహ్మణుడు శూద్రుని యాచింపడు. కావున అభిప్రతారి క్షత్రియుడై యుండవలయును.

ఈ ప్రసంగమును జదివిన తరువాతగూడ అభిప్రతారియు క్షత్రియుడని నిర్ణయించుటకు తగిన ప్రబల ప్రమాణాలు ఆచార్యులకు లభింపలేదనియే స్పష్టమగుచున్నది. కంఠోక్తిగా అభిప్రతారి క్షత్రియుడని చెప్పబడలేదు. అతడు క్షత్రియుడనుటకు పురోహిత కులమువాడైన కాపేయునితో కలిసి భోజనమున కొకచో కూర్చుండుటయు, బ్రహ్మచారిచే యాచింపబడుటయు తప్ప వేఱు ప్రమాణముకాని, క్షత్రియబోధక పదముకాని దొరకదు. అందువలన అభిప్రతారి జాతిక్షత్రియుడనుటయు సందిగ్ధమే యగుచున్నది. ఇట్టి సందిగ్ధ జాతి క్షత్రియునితో బాదరాయణ సంబంధము కల్పించి దానిద్వారా జానశ్రుతి జాతిక్షత్రియు డనుట యెంత యుక్తి యుక్తమో పాఠకు లాలోచింతురుగాక! దీనింబట్టి శంకరస్వాము లెంతటికైన ఘటికులనక తప్పదు.

"కాపేయునితో సంబంధమున్నంత మాత్రాన అభిప్రతారి క్షత్రియుడని యెందుల కంగీకరింపవలయును స్వామీ?" అని శంకరుల నడిగిన వా రిట్లనుచున్నారు. 'తాండ్యబ్రాహ్మణమున నొకచో' (ఏతేన వై చిత్రరథం కాపేయా అయాజయన్. తాం.బ్రా.20.2.5) 'చిత్రరథునిచే కాపేయులు యజ్ఞము చేయించిరి'. ఈ వాక్యమునుబట్టి 'కాపేయులు యాజకులనియు' వారిచే యజ్ఞముచేయింపబడినవాడు కావున చిత్రరథుడు క్షత్రియు డనియు తెలియుచున్నదట!' యజ్ఞము చేయించినందున కాపేయులు పురోహితులు, బ్రాహ్మణులునని యొప్పుకొనవచ్చునేమోకాని, అంతమాత్రమున చిత్రరథుడు క్షత్రియు డెట్లయ్యెనని యాచార్యుల నడుగుదుమేని ఆచార్యులు తమ భాష్యమందు (తస్మాత్ చైత్రరథిర్నామ ఏకః క్షత్రపతి రజాయత) అందువలన చైత్రరథియను నొకడు క్షత్రపతి యయ్యెను' అను నొక వాక్యము నుద్ధరించి చిత్రరథుడు క్షత్రియుడని సాధించియున్నారు. కాని ఈ వాక్యమెక్కడిదో తెలియదు. ఈ యజ్ఞాతవాక్యప్రమాణముతో చైత్రరథుడు క్షత్రియుడైనాడు. అట్టి చైత్రరథునకు పురోహితులు కాపేయులు. అట్టి కాపేయవంశజునితో నొకే పంక్తియందు భోజనార్థమై కూర్చున్నాడు. కావున అభిప్రతారి చిత్రరథ క్షత్రియవంశ సంబంధియగునట! అందువలన నతడు క్షత్రియుడు! అట్టి క్షత్రియుడు నేర్చిన సంవర్గవిద్య నెన్నడో నేర్చినవాడు కావున జానశ్రుతి

తప్పక జాతిక్షత్రియుడై యుండవలయునట! అహో!

ఈ సాధనపరంపరను తెలిసికొనిన తరువాత పాఠకులకు శంకర స్వాము లెంత ప్రయాసబడి జానశ్రుతి క్షత్రియత్వమును నిరూపించిరో బాగుగ బోధపడి యుండునని యెంచెద. ఈ సాధనను బట్టి జాన శ్రుతి జాతిక్షత్రియుడని యెవరైన నంగీకరింపగలరా? ఇందు గనబఱచిన సంబంధము లన్నియు బాదరాయణ సంబంధములుకాక మఱియేమగును? ఇందుకు విపరీతముగ 'జానశ్రుతి శూద్రుడు కాబట్టి వానితో సంబంధ మున్నందున అభిప్రతారి, కాపేయుడు, బ్రహ్మచారి, చైత్రరథుడు ఎల్లరు శూద్రులే యగుదురు. క్షత్రియులుకాని, బ్రాహ్మణులుకాని కారు' అని యెవరైన నందురేని శంకరస్వాములు తనపక్షమును సాధించుట కేమి ప్రమాణము నీయగలరు? స్వాముల సాధన డొంకతిరుగుడుగా లేదా?

ఈ సాధనలో బలమేమియు లేదని యెంచియే కాబోలు శంకర స్వాములు రైక్వునిచే జానశ్రుతికై ప్రయోగింపబడిన శూద్రపదమునకు రూఢ్యర్థము నంగీకరింపక (శుచాద్రవతీతి శోకేన దుద్రావ ఇతివా శూద్రః) 'శోకముచే పరువిడుటచే నితడు (జానశ్రుతి) శూద్రుడన బడినాడ'ని యౌగి కార్థమును చెప్పినారు. అంతటితో నూరుకొనక 'శూద్ర! అని సంబోధించి రైక్వుడు తన సర్వజ్ఞత్వమును వెల్లడించినాడు. అందులకే జాతిక్షత్రియుడైన జానశ్రుతిని 'శూద్ర!' అని పిలిచినాడు' అనియు వ్రాసినారు. అహో! శంకరస్వాములయూహ నేమని కొనియా డవలయునో తోచకున్నది. ఈ యుక్తులచే జానశ్రుతి జాతిక్షత్రియుడని యెట్లు బోధపడగలదు? శూద్రపదమునకు యౌగికార్థము కల్పించినం దున నిట జానశ్రుతి శోకముతో వచ్చినవాడని తెలియు ననుకొందము. అంతేకాని యతడు జన్మతః శూద్రుడు కాడనికాని, క్షత్రియుడైనట్లుకాని ఎట్లు తెలియగలదు? శోకముతో వచ్చినవారెల్లరు జాతిక్షత్రియులగుదురా? జాతి శూద్రుడు కాడని యన్నంత మాత్రమున నొకడు జాతిక్ష త్రియు డగునా? బ్రాహ్మణుడేల కారాదు? ఇందులకు నియామకమేమి? ఇంతేకాక ఆచార్యులచే ప్రదర్శింపబడిన యీయుక్తులు జానశ్రుతి జాతిక్ష త్రియుడని సాధించుటకు బదులతడు శూద్రుడుకాడనియు, శోకార్తుడై వచ్చినవాడనియు మాత్రము బోధపఱచును.

రైక్వుడు తన సర్వజ్ఞత్వమును వెల్లడించుటకై క్షత్రియుడైన జాన శ్రుతిని "శూద్ర" అని శూద్రపదముచే సంబోధించి నాడనుట మఱియు వింతగొలుపుచున్నది. ఒకవేళ పిలిచినాడే యనుకొందము. దానివ లన జానశ్రుతికి క్షత్రియత్వ మెట్లు సిద్ధించును? అయ్యది సిద్ధింపకపోగా రైక్వుని స్వాభిమానమును. ఆత్మస్తుతిని తెలియజేయుచున్నదని యెంచ వలసి వచ్చుచున్నది. రైక్వుడు మహర్షి; బ్రహ్మవిదుడు, ఏషణాత్రయమును వర్జించి యరణ్యమున నొంటరిగా నొక బండినీడను బడియున్నవాడు. అట్టి వాడు తనకడ కరుదెంచిన క్షత్రియుని శూద్రపదముచే సంబోధించి తన సర్వజ్ఞత్వమును దెలుపు కొనుటలో గల ఘనత యేమున్నది? తన సర్వ జ్ఞత్వమును సూచించి జానశ్రుతినుండి పొందవలసిన దతని కేమిగలదు? పరమహంసల సంవాదము మూలమున రైక్వుని మాహాత్మ్యము జానశ్రుతి కంతకుపూర్వము తెలిసియేయుండెనుగదా! అట్టివానికి మరల తన సర్వ జ్ఞత్వమును దెలుపు కొనుటలోగల యౌచిత్యమేమున్నది? అందువలన నీ యుక్తులును ఆచార్యుల సాధన కేమియు తోడ్పడుచున్నట్లు కానరావు. శంకరస్వాము లీసంగతిని గుర్తించియే యున్నారు. కావుననే చివరకు జానశ్రుతి క్షత్రియత్వమును సాధించుటకు మఱియొకయుక్తిని ప్రదర్శించి యున్నారు. పాఠకులు దానిని కూడ గమనింతురుగాక.

జానశ్రుతికి రథము నడపుట కొక సారథి యున్నాడు. గోవుల సంపద యున్నది. రత్నహారము లున్నవి. దానాది గుణములలో నతడు ప్రసిద్ధుడు. అందువలన నతడు క్షత్రియుడనియే యెఱుగవలయునట!

ఆచార్యు లొసంగిన యీ చివరి హేతువు వలనను జాతి క్షత్రియ త్వమెట్లు సిద్ధించునో తెలియకున్నది. సారథి, ఐశ్వర్యాదులు నొకని కున్నంతమాత్రమున నతడు జన్మతః క్షత్రియుడని యెట్లు బోధపడును? అటులయిన నైశ్వర్యము కలవారందఱు క్షత్రియులే కావలసివత్తురు. ఐశ్వర్యాదులు జన్మమునకు బోధకములా? ఎన్నటికిని కాజాలవు.

అప్రతిమ ప్రతిభులయిన శంకరభగవత్పాదులు, అనుపమయుక్తులతో బౌద్ధాది యవైదిక మతములను ఖండించిన మహామతులు నీ ప్రసంగ మున నెందుల కింతటి దుర్బల యుక్తుల నాశ్రయించిరో బోధపడ

కున్నది. పాపము! ఏమి చేయగలరు? ప్రబలయుక్తులు దొరకనపుడు దుర్బలయుక్తుల నుపయోగింపక చేయవలసిన దేమున్నది? అట్లు చేయ కపోయిన శూద్రులకు వేదమున నధికారము సిద్ధించునేమో! కావున శూద్రులకు శాస్త్రమున నధికారము లేకుండ జేయుటకై శంకరాచార్యు లింతగా పాటుపడవలసి వచ్చినది. కాని యిట్టి దుర్బలయుక్తులు తన కీర్తిప్రతిష్ఠల కెంతటి హాని కలిగించునో గుర్తింపకుండుట శోచనీయము, ఆచార్యుల పాండిత్యమునకు, రచనాకౌశలమునకు ముగ్ధులముకాక వారి ప్రసంగమున నొసంగిన యుక్తులను క్రమముగా పరిశీలించి చూచినచో నన్నియు యుక్త్యాభాసములే యని బోధపడకపోదు. ఇది యంతయు జూడగా నేదోయొకవిధము నాశ్రయించి శూద్రులకు శాస్త్రమునం దధికారము లేకుండ జేయుటకై శంకరస్వాములు ఎంతగానో ప్రయాస పడినట్లు స్పష్టమగుచున్నది. ఇంతటి ప్రయాస మొనరించియు వారిందు పొందిన సాఫల్యమేమియు కానరాదు. నిష్పాక్షికులగు పాఠకులకు శంక రస్వాముల పరిశ్రమము న్యాయయుక్తము, సముచితమునని యెన్నటికిని భాసింపదనియే నా నిశ్చయము.

ఇక రెండవ ప్రసంగము సత్యకామునిది. శూద్రులకు శాస్త్రమున నధికారములేదని సాధించుట కీ ప్రసంగమును కూడ నీ యపశూద్రాధికర ణమున శ్రీశంకరు లుల్లేఖించి యున్నారు. దానిని కూడ పరిశీలింతము. (తదభావనిర్ధారణే చ. 1.3-35) అను బ్రహ్మసూత్రమును వివరిం చుచు శంకరస్వాములు సత్యకాముని ప్రసంగము నుదాహరించి శూద్రులకు శాస్త్రమున నధికారము లేదని సాధించియున్నారు. సత్యకాముని కథ ఛాందోగ్యోపనిషత్తు చతుర్థప్రపాఠకములో నిట్లున్నది:-

ఒకమాటు జబాల యను నామె పుత్రుడు సత్యకాముడు బ్రహ్మచ ర్యవ్రత మొనర్పనెంచి తనతల్లిని "నా గోత్రమేమి" యని యడిగెను. అందుల కామె పుత్రునితో (నాహమేతద్ వేద తాతః యద్ గోత్రస్త్వమసి. బహ్వహం చరన్తీ పరిచారిణీ యౌవనే త్వామలభే. సాహ మేతన్నవేద యద్ గోత్రస్త్వమసి. జబాలా తు నామాహమస్మి. సత్యకామో నామ త్వమసి. సత్యకామ ఏవ జాబాలో బ్రువీథా ఇతి) "వత్స! నా పేరు జబాల. నీ గోత్రము నాకు తెలియుదు. అనేకులను చరించుచు పరిచా

రిక నగు నేను యౌవనమున నిన్ను గంటిని. అందువలన నీ గోత్రము నెఱుగజాల నైతిని. నా పేరు జబాల. నీ పేరు సత్యకాముడు. జాబాలి, సత్యకాముడ ననియే చెప్పుము" అని బదులు చెప్పినది.

సత్యకాము డంతట గోతమ వంశజుడైన హారిద్రుమతుని చెంతజేరి 'భగవన్! బ్రహ్మచర్యము వసింతును. నన్నుపనయింతురుగాక' యని యర్థించెను. అందుల కా గౌతముడు 'సౌమ్యా! నీ గోత్రమేమి?' యని ప్రశ్నింపగా సత్యకాముడు తన తల్లి చెప్పిన మాటల నట్లే తు.చ. తప్పకుండ బదులు చెప్పెను. అంతట నా ముని, (నైతదబ్రాహ్మణో వివక్తు మర్హతి. సమిధం సోమ్యాహర ఉపత్వానేష్యే న సత్యాదగాః) 'అ బ్రాహ్మణు డిట్లు చెప్పడు. సోమ్య, ఇంధనములను తెమ్ము; నిన్ను ఉపనయింతును. నీవు సత్యమునుండి తొలగవైతివి' యని యతనికి దీక్ష నొసంగి విద్యాదానము చేసియుండెను.

ఇయ్యది సత్యకాముని ప్రసంగము. ఈ ప్రసంగము నుల్లేఖించి యాచార్యులు (యత్ సత్యవచనేన శూద్రత్వాభావే నిర్ధారితే జాబాలం గౌతమ ఉపనేతు మనుశాసితుం చ ప్రవవృతే). 'సత్యమాడినందున శూద్రత్వాభావము నిర్ధారణము కాగా గౌతముడు సత్యకాము నుపనయించి యనుశాసించుటకు ప్రవృత్తుడయ్యెను' అని వ్రాసి యంతమున 'కాబట్టి శూద్రునకు శాస్త్రమున నధికారము లే' దని నిర్ణయించి యున్నారు.

చూచితిరా శంకరస్వాముల సాధన! సత్యకాముడు సత్యమాడినందున నతడు బ్రాహ్మణుడు కాదగునని నిర్ణయించి గోతము డతనికి నుపనయన మొనర్చి విద్య ననుగ్రహించి యుండెను. దీనివలన జాతి బ్రాహ్మణునకు శాస్త్రమున నధికార మున్నదనియు, జాతిశూద్రునకు లేదనియు నెట్లు సాధింప వీలగును? పాఠకులు గమనింతురుగాక!

సత్యకాముని తల్లి జబాల. ఆమె పరిచారిక. అనేకులను చరించుచు యౌవనమున సత్యకాముని గన్నది. తల్లి తనకు చెప్పిన మాటలను సత్యకాముడు గౌతమునకు చెప్పినాడు. ఈ ప్రసంగమును జదివి యెవరైనను సత్యకాముడు జాతి బ్రాహ్మణుడు అనగా జన్మతః బ్రాహ్మణ దంపతులకు బుట్టినవాడు; అని యెంచగలరా? లేదు. పైపెచ్చు అజ్ఞాత కులగోత్రుడని

స్పష్టముగా ప్రసంగమునలేదా? ఐనను సత్యకాముడు శంకరస్వాముల దృష్టిలో జాతి బ్రాహ్మణుడే యయ్యెను. ఆచార్యుల నే మనగలము? జబాల తనను గుఱించి బ్రాహ్మణీ యనియైనను చెప్పక పరిచారిక నని చెప్పుకొన్నది. బ్రాహ్మణి యగుచో పరిచారిక యెట్లగును? ఆచార్యుల మతమున బ్రహ్మచారి శూద్రుని యాచించుటకే వీలుకానపుడు బ్రాహ్మణి శూద్రవృత్తియైన పరిచర్య నెట్లు గ్రహింపగలదు? దారిద్ర్యముచే నట్లు గ్రహింపవచ్చు నందురేని బ్రహ్మచారి ధనికుడైన శూద్రుని యాచించు టలో గలదోషమేమి! వృత్తియెట్టిదైనను తన్ను దా బ్రాహ్మణి యని చెప్పుటలో జబాలకు కలిగిన యాటంకమేమి? మఱియు, 'అనేకులను చరించుచు యౌవనమున నిన్ను గంటిని అని చెప్పుటవలన సత్యకా ముడు వ్యభిచారజన్ముడని తెలియుట లేదా? అట్టివాడు శూద్రునికంటె నికృష్టుడే యగును; కాని జాతిబ్రాహ్మణు డెట్లు కాగలడు? అజ్ఞాత కులగోత్రుడు, వ్యభిచారజన్ముడునైన సత్యకామునకు సత్యభాషణము కారణముగా గౌతము డుపనయన మొనర్చి శాస్త్రము నభ్యసింపజేసినట్లు ప్రసంగము స్పష్టపఱచుచుండగా నా ప్రసంగమునే యాధారముగా గొని 'శూద్ర జన్ములకు శాస్త్రమున నధికారము లేదు' అని నిర్ణయించుట యాచార్యులకే చెల్లుబడి కాగలదు. ఇతరు లిట్టి నిర్ణయమును జేసిన పరీక్షకు లా నిర్ణయమును నప్రామాణికము, నసంగతమునని త్రోసిపు చ్చకుందురా?

శంకరస్వాముల వచనమును బట్టి చూచినను సత్యకాముడు జాతి బ్రాహ్మణు డెట్లు కాగలడు? శంకరులు (సత్యవచనేన శూద్రత్వాభావే నిర్ధారితే) 'సత్యవచనముచే శూద్రత్వా భావము నిర్ధారణము కాగా' అనుటను బట్టి శూద్రత్వా భావమును నిర్ణయించుటకు సత్యవచనము కారణమైనట్లు శంకరులే యంగీకరించుచున్నారు. శూద్రత్వము సత్యకాముని యందు లేదని సత్యవచనము వలనగదా తెలిసినది. 'సత్యకాముని యందు శూద్రత్వము లేదు' అనియే సత్యవచనము వలన తెలిసినది. బ్రాహ్మణ జన్ముడని సత్యవచనము చెప్పలేదుగదా! శూద్రులు కాని వారం దఱు బ్రాహ్మణులని నిర్ణయింపనగునా? సత్యవచనము శూద్రత్వాభావ మును నిర్ణయించుచున్నదని చెప్పుచు స్వయముగా శంకరులు సత్యకాముడు

బ్రాహ్మణుడని యెట్లు చెప్పగలరో తెలియకున్నది. ఒకవేళ సత్యభాషణము బ్రాహ్మణత్వమునకు ద్యోతకమని యంగీకరింతుమేని బ్రాహ్మణత్వమునకు సత్యభాషణాది గుణములే కారణములు కాని జన్మకాదని నిర్ణయమగును. అందువలన సత్యకాముడు జాతి బ్రాహ్మణుడేకాక, జన్మతో సంకరు డయినను సత్యభాషణముచే బ్రాహ్మణు డయినట్లు సిద్ధాంతమగును. అట్లు సిద్ధాంతము చేయుట శంకరస్వాముల కిష్టములేదు. కారణమేమన:- అట్లంగీకరించినచో సత్యమాడు వారందఱు బ్రాహ్మణులగుదురు. శూద్ర జన్ములుకూడ సత్యమాడి బ్రాహ్మణులయి శాస్త్రమున కధికారుల గుదురు. అప్పుడు పుట్టి మునిగిపోవును. ఆచార్యుల పరిశ్రమ మంతయు వ్యర్థమగును. వారు చేసిన కుట్ర ఫలింపదు. గుణవంతులెల్లరు విద్యావంతులై బాగుపడిపోవుదురు. ఇది యెంతటి యనర్థమునకు దారితీయునో కదా! అందఱు విజ్ఞానవంతులైన ప్రపంచము నడవగలదా? కాబట్టి సత్యమాడినంత మాత్రమున బ్రాహ్మణుడగునను సిద్ధాంతము శంకరుల కిష్టముకాదు. అటులయిన సత్యకాముడు బ్రాహ్మణు డెట్లయ్యెను? ఈ ప్రశ్న మఱ్లే నిలిచిపోవుచున్నది.

జబాల చెప్పిన వృత్తమును బట్టి సత్యకాముడు వ్యభిచారజన్ముడని స్పష్టపడుచున్నను, 'సత్య మాడినందున బ్రాహ్మణునకే యతడు జన్మించినాడు; అందువలననే యతడు సత్యమాడ గలిగినాడని' యంగీకరింతుమేని, నేటి బ్రాహ్మణ జన్ములందఱు సత్యభాషులే కావలసియుందురు. అందఱు వశిష్ఠ వామదేవ భారద్వాజస గోత్రములందు జన్మించిన వారేకదా? మఱి వీరందఱు సత్యమాడరేల? అబద్ధము లాడుచున్నారు. కావున వీరు బ్రాహ్మణ జన్ములు - జాతిబ్రాహ్మణులు కారనియన వచ్చునా? అట్లనుట యపచారమగును. కాబట్టి బ్రాహ్మణులకు జన్మించుట సత్యభాషణమునకు నియామకము కాదని బోధపడుచున్నది. అటులయిన సత్యమాడినంత మాత్రమున సత్యకాముడు జాతి బ్రాహ్మణుడని శంకరస్వాము లెట్లు నిర్ణయించుచున్నారు? ఎన్ని విధముల నాలోచించినను ఆచార్యుల నిర్ణయము యుక్తి సంగతముగా కనబడదు. యుక్తి ప్రమాణములతో సత్యకాముడు బ్రాహ్మణుడు కాడని సిద్ధించినను శంకరస్వాములు మహాయోగులు కావున సమాధినిష్ఠులై యతని బ్రాహ్మణత్వమును

- బ్రాహ్మణజన్మతను, తెలిసికొని యుందురని యెవరేని చెప్పిన దానికి నేను దాసోహమ్మనక తప్పదు. వారి యోగశక్తిని శంకింప నేనెంత వాడను? కాని, అప్పుడీ యుక్తి ప్రయుక్తులను బ్రయోగించుట వ్యర్థమ నక తప్పదు. అసలు శంకరస్వాములు స్వయముగా శూద్ర జన్ములెంత గుణవంతులైనను జదువరాదని యనుశాసించిన కాదనువా రెవరు? ఇంత వ్యర్థప్రయాసముచేసి యెందుల కీ నాటకమాడిరో యర్థము కాకున్నది.

ఆచార్యుల స్థితి యిట్లుండగా వారి యనుచరులలో మహావిద్వాంసు లనదగు వాచస్పతిమిశ్రు లీ సందర్భమున నెట్లు వ్యాఖ్యానము చేసియు న్నారో చూడుడు. వారివ్యాఖ్యానము జదివినపుడు 'అతనికంటె ఘనుడు ఆచంట మల్లన్న' యను సామెత స్మరణకు రాకమానదు.

అపశూద్రాధికరణమున గల సూత్ర భాష్యమును వివరించుచు వాచ స్పతిమిశ్రు లీప్రసంగము నిట్లు సమర్థించుచున్నారు. (త్వజ్జనక పరిచరణ పరతయా నాహమజ్ఞాసిషం గోత్రం తవ). 'నీ జనకుని పరిచర్యాపర నైనీ గోత్రము నెఱుగనైతిని' అని జబాల సత్యకామునితో చెప్పినట్లు ఒక క్రొత్త వాక్యమునే వాచస్పతులు సృష్టించియున్నారు. వాచస్పతు లైరి! వారికి వాగ్రచనలో లోటేమున్నది? సమర్థు లేది వ్రాసినను చెల్లుబడి యగునని యెంచి వ్రాసినట్లున్నది. అందువలననే కాబోలు గోసాయి తులసీదాసు (సమరథకో నహి దోస గుసాయీ) సమర్థునకు దోషము లేదన్నారు. లేకున్న ఉపనిషత్తునందు (బహ్వాహం చరన్తీ పరి చారిణీ యౌవనే త్వామలభే) 'అనేకుల జరించుచు యౌవనమున నిన్ను గంటిని' అని జబాల చెప్పినదని యుండగా నాజబాల కొకపతిని గల్పించి, వానిని సత్యకామునకు జనకునిగాజేసి యతని పరిచర్యలో మునిగి తేలుచు జబాల సత్యకాముని గోత్రమును తెలిసికొనజాలక పోయినది అని చెప్పి సత్యకాముడు జాతి బ్రాహ్మణుడే యని వాచస్పతు లెందుకు సాధింప బూనుదురు? -

ఇది యంతయు జూడ శూద్రులను శాస్త్రజ్ఞానమునుండి వంచింపజే యుటకు పన్నిన పన్నుగడగా కనబడుటలేదా! లేకున్న నీ యప శూద్రాధి కరణమునకు వేఱొండు ప్రయోజనమే కన్పింపదు. శూద్రజన్ములయెడ

బ్రాహ్మణ నామధారులకు గల యసూయ, ద్వేషము నీ యధికరణము చెప్పక చెప్పుచున్నది. శంకరస్వాములవంటి యాచార్యులకు శూద్రజన్ము లయెడ నెంతటి ద్వేషమున్నదో స్పష్టముగా తెలిసికొనవలయుననిన నీ ప్రకరణము నింతటితో సమాప్తము చేసిన చాలదు. ఇకముందు వ్రాయ బోవు పంక్తులను కూడ పాఠకులు గమనింతురుగాక.

శ్రీ శంకరస్వాములు శూద్రులకు శాస్త్రమున నధికారము లేదని సాధించి యంతటితో కసితీఱక కాబోలు పాపము! (శ్రవణాధ్యయనార్థ ప్రతిషేధాత్ 1.3.38.) అను సూత్రమునకు భాష్యము వ్రాసి యందు శూద్రజన్ములకు కొన్ని వరములను కూడ ప్రసాదించియున్నారు. అవి వరములో లేక శాపములో పాఠకులే గుర్తింపగలరు! అట్టివరదాతలయిన యాచార్యుల హృదయ మెంతటి దయార్ద్రమో కూడ పాఠకులూహింతు రుగాక!

(1) 'అథాస్య వేద ముపశృణ్వత స్త్రపుజతుభ్యాం
శ్రోత్రప్రతి పూరణమ్. శాం.భా.'

'వేదమును విను శూద్రుని చెవులు సీసముతోను లక్కతోను నింప వలయును'.

(2) 'భవతి చ వేదోచ్చారణే జిహ్వాచ్ఛేదో ధారణే శరీర
భేదః' శాం.భాష్యము.

'శూద్రుడు వేదము నుచ్చరించిన నతని నాలుక ఛిన్నమగును. ధరిం చినచో- స్పృశించినచో లేక చదివిధారణ చేసినచో శరీరము భిన్నమగును'.

(3) 'పద్యుహ వా ఏత చ్ఛ్మశానం యచ్ఛూద్రః
తస్మా చ్ఛూద్ర సమీపే నాధ్యేతవ్యమ్'

'శూద్రుడు స్మశానమువలె నపవిత్రుడు. అందువలన నతని సమీప మున వేదము జదువరాదు'.

(4) 'శూద్రాయ మతిం న దద్యాత్'

'శూద్రునకు జ్ఞానము గలిగింపరాదు'.

వేదాంతసూత్రములకు భాష్యమును రచించి యందు శ్రీ శంక

రభగవత్పాదులు శూద్రులకు ప్రసాదించిన మేటి వరము లివి. శూద్ర జన్ము లనిన శ్రీ శంకరస్వాముల కెంతటి యనుగ్రహమో చూడుడు. కంచెయే చేనుమేసిన కలదె దిక్కు? అని ఆచార్యులే శూద్రజన్ముల కింతటి మహోపకారము చేసియుండ వారి యనుచరులు నేటి బ్రాహ్మణ నామధారులు శూద్రులతో నెట్లు వ్యవహరింపగలరో చదువరు లూహింతు రుగాక! సంస్కారజన్ములు, జగద్విఖ్యాత ప్రతిభావంతులు, జగద్ధితార్థమై జన్మించి యావజ్జీవము నఖండ బ్రహ్మచర్యవ్రత నిష్ఠాగరిష్ఠులై వేదవిరుద్ధములగు బౌద్ధాది మతముల నపసిద్ధాంతములని నిరూపించిన ధీశాలురు; జగద్గురువులు శంకరాచార్యులు. అట్టివారికి శూద్రజన్ములనిన నింత ద్వేషమేల? ద్వేషములేక యనురాగమేయున్న శూద్రులను జ్ఞానమునుండి వంచింప ననువగు సిద్ధాంతముల కుయుక్తులతో సాధింపనేల? శూద్రులు మానవులు కారా? వారు శాస్త్రములను జదివి జ్ఞానులు కానొల్లరా? వారియెడ నెందుల కీయన్యాయము?

వాస్తవమున వేదశాస్త్రములను జదువు నధికార మెవరికున్నది? ఎవరికిలేదు? అను విషయమును నిర్ణయించుటకు వేదములే ప్రమాణములు కాని యన్యములు కావు. ఋషి ప్రణీతములగు స్మృత్యాదులు స్వతః ప్రమాణములైన వేదముల ననుసరించినంత వఱకు ప్రమాణము లగును. కాని వానికి విరుద్ధముగా స్వతంత్రించి యేవిషయమును నిర్ణయింపజాలవు. ఆచార్యులును వేదానుకూల నిర్ణయములు చేసిన నవిపాటింప యోగ్యములగును; విరుద్ధముగ చేసిన నిర్ణయములు జనుల యాదరణమునకు పాత్రములెన్నడును కావు. అందువలన శూద్రులకు వేదములను - శాస్త్రములను - జదువు నధికారము ఉన్నదా? లేదా? యని వేదములనే పరామర్శించుట సమంజసమగును.

వేదములు చదివి చూచినవారికి నందు వేదాధ్యయనము జేయు నధికారమెల్లరకును కలదని కంఠోక్తిగా చెప్పబడుట జూడగలము.

('యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయ చ స్వాయ చారణాయ చ'. (యజు 26-2)

ఈ మంత్రమున జనులనెల్లర నుద్దేశించి భగవంతుడు వేదవాణిని కల్యాణకరమగు దానిని - యుపదేశించి యున్నట్లు స్పష్టముగా చెప్పబడినది. మంత్రమునందు జనులకని ముందుగా చెప్పి, యటుపై నా జనశబ్దమును వివరించుచు బ్రాహ్మణులు, రాజన్యులు, శూద్రులు, వైశ్యులు, భృత్యులు, అర్యులు, అనార్యులు నెల్లరునని స్పష్టపఱపబడినది. మంత్రమునందు బ్రాహ్మణాది శబ్దములతో బాటు శూద్రశబ్దము కూడ స్పష్టముగా సమానముగా గ్రహింపబడుట గమనింపదగిన విషయము. శ్రేయస్కర విధులలో నెల్లయెడల బ్రాహ్మణులతోబాటు శూద్రాదులను గ్రహించి యున్నట్లు వేదమంత్రములలో ననేక స్థలములందు జూడనగును.

ఇట్లు వేదములందు శూద్రులు శాస్త్రమున కధికారులని చెప్పియుండగా బాదరాయణ సూత్రములందు నిరాధారముగ నపశూద్రాధికరణము నొకదానిని కల్పించి, యా శాస్త్రనెపముతో శూద్రుల నధ్యయ నాధ్యాపనాదులనుండి వంచించుటకు శంకరస్వాములవంటి స్వాముల కధికార మెవరొసంగిరి? తమంత తామే యధికారముంగైకొని వేద విరుద్ధ నిర్ణయముల జేసి యెంతకాలము మానవులను వంచింపగలరు? వీరి వ్యాఖ్యానముల నెవరాదరింతురు? వంచనలతో కొందఱను విద్యనుండి దూరమొనర్చి వీరు జగద్గురువు లెట్లగుదురు? ధర్మస్థాపకులైన యాచార్యులే మోసగింప బూనుకొనిన తక్కిన మనుజుల నేమనగలము?

మఱియు ఋగ్వేదము ప్రథమ మండలములోని 116వ సూక్తమునకు ఋషి కక్షీవంతుడు. అతడంగరాజమహిషియొక్క దాసీ పుత్రుడు; అతిశూద్రుడు. ఇట్లే నవమ మండలములోని 76వ సూక్తమునకు కూడ నతడే ఋషి. ఆ కక్షీవంతుని పుత్రుడు శబరుడనువాడు దశమ మండలములోని 169వ సూక్తమునకు ఋషి. కక్షీవంతుని పుత్రిక ఘోషయను నామె దశమ మండలములోని యనేక సూక్తములకు ఋషిక. ఈమెయే గాక అదితి, గోదా, నదీ, యమీ, శశ్వతీ, సరమా, సూర్యా, ఊర్వశీ, అత్రేయీ ప్రభృతు లెందఱో విదుషీమణులు మంత్రద్రష్టలుగా వేదములందు జూడబడుచున్నారు.

ఇంతేగాక, ఇలూషాపుత్రుడు కవషుడు 'అపోనప్త్రియ' మను సూక్త

మును ప్రకాశింపజేసినాడు. ఇతరాపుత్రుడు, ఐతరేయుడు - దాసీజన్ముడు బ్రాహ్మణ గ్రంథము రచియించియున్నాడు. ఇట్లెందఱో శూద్రులు, అతి శూద్రులునగు స్త్రీ పురుషులు వేదప్రకాశకులు, వేదవిదులునై యుండ (స్త్రీ శూద్రా నాధీయాతామ్) అను కపోల కల్పిత విధుల మూలము నను, అపశూద్రాధికరణము వంటి ద్వేషబుద్ధితో రచియింపబడిన ప్రసంగముల మూలముననుస్త్రీ శూద్రులకు వేదశాస్త్రములను జదువుటకే కాదు వినుటకు కూడ నధికారము లేదని శాసించుట మహాఘోరము. అంతటితో తృప్తిపడక యట్టి శాసనముల నుల్లంఘించిన వారికి అమానుషములగు దండనలను గూడ విధించుట నేమనవలయునో తోచకున్నది.

వేదము లీశ్వరీయములని యంగీకరించుచు నందు మానవులలో కొందఱు కధికారము లేదనుట యెట్లు సంగతమగును? ఈశ్వరీయ వేదము లొకరికి సొత్తై మఱియొకరి కెట్లు కాకుండును? జన్మ-జాతిభేదములను గల్పించి మానవులను జ్ఞానదూరుల నొనర్చుట యక్షమ్యదోషమనక తప్పదు.

అందువలననే పరమపితయగు పరమేశ్వరునిచే ప్రసాదింపబడిన వేద వాక్కులను జదువుటకు జదివించుటకు, వినుటకు వినిపించుటకు, స్త్రీ శూద్ర భేదముకూడ పాటింపక యెల్లరకు నధికార మున్నదనుటయే కాక చదువుట, చదివించుట, వినుట, వినిపించుట కర్తవ్యమని కూడ నవయుగ ప్రవర్తకుడైన మహర్షి శ్రీమద్దయానంద సరస్వతి తనచే రచియింపబడిన ప్రసిద్ధ సత్యార్థ ప్రకాశాది గ్రంథములందు స్పష్టముగా వ్రాసియున్నాడు. మహర్షు లాచార్యులవలె రాగద్వేషాది దోషములకు లోనుగారుకదా! రాగాది దోషములచే గ్రస్తులయి, పక్షపాతబుద్ధితో వ్యవహరించి యాచార్యులు - శ్రీ శంకరస్వామి ప్రభృతులు సంప్రదాయములను ప్రవర్తింపజేసి యున్నారు. ఇక మహర్షులో పక్షపాతమునకు లోబడక యుదారచరితులై, వసుధైవకుటుంబికులై సార్వభౌమధర్మములను ప్రబోధించి యున్నారు. 'అందువలన నాచార్యమతములను వీడి సర్వశ్రేయస్కరములు, మహర్షి ప్రబోధితములు, వేదవిహితములునగు సార్వభౌమ ధర్మములను గ్రహించి విశ్వకల్యాణమునకు తోడ్పడుదురుగాత!'

ఓమ్

హేతువాది
# మహర్షి దయానంద సరస్వతి

మనము ఇరువదియవ శతాబ్దమున జీవనయాత్ర నడుపుచున్నాము. ఇది విజ్ఞాన యుగము. నేటి మానవుడు విజ్ఞాన బలముతో నాకసమున విహరించుచున్నాడు. గ్రహాంతరములకు బోవు మార్గములను నిర్మించుచు న్నాడు. రోదసీ కుహరమున ప్రవేశించి రాకెట్టుల సాహాయ్యముతో భూగోళమును చుట్టి వచ్చుచున్నాడు. ఇది యంతయు నేటి మానవ మస్తిష్క వికాసమున కద్భుత నిదర్శనము. కావున నిప్పటి మానవుడు అంధవిశ్వాసములకు దూరముగా నుండవలసినవా డనుట నిక్కువము. మూఢాచారములకు తన జీవితమున తావొసంగ రాదు. మతముపేరుతో కాని, ధర్మముపేరుతోగాని, రాజనీతియను నెపముతో కాని అమానుష కృత్యము లాచరింపరాదు. మనుష్యుడు మననశీలుడు. స్వభావముతోడనే మానవుడు ఆలోచింప ననువగు శక్తి కొలదిగానో గొప్పగానో కలవాడు. కావుననే సృష్టి ప్రారంభమైన నాటినుండియు తన యాలోచనా శక్తిని పురస్కరించుకొని భూమి మీద నడయాడు మానవుడు నేటికి భూన భములకు మధ్య సాధారణ మానవునకు - పామరునకు దిగ్భ్రాంతిని గలిగించు వేగముతో వరువిడ నేర్చినాడు. ఇయ్యది మానవుని ప్రగతిశీల మునకు నిదర్శనము కాక మఱి యేమగును? ఇది మానవ మస్తిష్కమున గల యాలోచనా శక్తికి ప్రమాణము.

తన స్వభావానుగుణముగా క్రమవికాసము నందుచు వచ్చిన మాన వజాతిలో నెక్కువ విద్యావంతులు, మిక్కిలి నాగరికులునైన మానవులు మానవజాతి పురోభివృద్ధికి హేతువాదము (Rationalism)ను ఉపయుక్త సాధనముగా నెంచుట సహజము. హేతువాదము మానవాభ్యుదయ మునకు తోడ్పడునని యెంచువారు, దానిని ప్రేమించువారు అనాలో

చితులుకారు. వారు బుద్ధిమంతులనుట నిక్కువము. అట్టివారు నేటి ప్రపంచమున గల వివిధ దేశములందు సంఖ్యలో మిక్కిలి తక్కువగా నున్నారు. భారతదేశమునందును కొందఱుగలరు. భారతీయులలో మానవతావాదు లీ తెగకు చెందినవారు. వీరు తమ్ము దాము హ్యూమ నిష్టులమనియు, రేషనలిష్టుల మనియు వ్యవహరించుకొందురు. వీరు హేతుబద్ధముగా నెల్లవిషయముల నిర్ణయించుట కంగీకరింతురు. వీరు అస్తికులవలె చేతన పదార్థముల నంగీకరింపరు. కొండొక గ్రంథమునకు పరమ ప్రామాణ్యము నంగీకరింపరు. మానవబుద్ధి సిద్ధములు, హేతుబద్ధ ములు మాత్రము వీరి కంగీకార్యములని యెంచెదరు. మానవాభ్యున్నతికి హేతువాదము సాధకతమమని వీరి యభిమతము.

దయానంద మహర్షి పందొమ్మిదవ శతాబ్దమువాడు. భారతదేశమునం దుదయించి భారతీయ భాషలలో నత్యుత్తమ మనదగు సంస్కృతము నభ్య సించి నైష్ఠిక బ్రహ్మచారియై యావజ్జీవము మానవాభ్యుదయచింతతో వేదసిద్ధాంతములను ప్రచారమొనర్చినవాడు. నానావిధ మత సిద్ధాంతము లను బాటించుచు వివిధాచార పరంపరల ననుసరించుచు నంధవిశ్వాస ములతో జిక్కువడి బాధల నందుచున్న భారతీయులలో విప్లవ భావముల నుదయింపజేసినవాడు. పందొమ్మిదవ శతాబ్దపు మానవులలో దయానందు డొక యుగ ప్రవర్తకుడనదగినవాడు. కాని క్రైస్తవులు బైబిల్‌ను, మహమ్మ దీయులు కురానును, బౌద్ధులు త్రిపిటకములను తమ తమ సిద్ధాంతముల కాధారముగా నెంచి ప్రచారము చేయునట్లు, దయానందుడు వేదమును పరమ ప్రమాణముగా నెంచి యందలి సిద్ధాంతములు మానవాభ్యున్నతికి తోడ్పడునవిగా ప్రచారముచేసి యున్నాడు. అట్టియెడ నతడు హేతువా దియెట్లు కాగలడు? హేతువాదికి పురాతన గ్రంథములు - వేదములు పరమ ప్రమాణము లెట్లు కాగలవు? అని హేతువాదులకు సందేహములు కలుగుటలో నాశ్చర్యముండదు. వేదములు పరమ ప్రమాణములుగా నంగీకరించు దయానంద సరస్వతి హేతువాది యగునా? అయిన నెట్లు? కానిచో నీతడు మానవాభ్యుదయాకాంక్షి యెట్లు కాగలడు? అనునది యీ నిబంధమునకు చర్చనీయాంశము.

మహర్షి దయానంద సరస్వతి భారతీయ తత్త్వవేత్తలలో నొకడు.

ప్రపంచమునగల తత్త్వవేత్తలను నేడు మనము పాశ్చాత్యులు, పౌర్వాత్యులు నని రెండు తెగలుగ విభజింతుమేని భారతీయతత్త్వవేత్తలు పౌర్వాత్యులలో జేరుదురు. భారతీయ తత్త్వవేత్తల దర్శనమునకు - ఆలోచనాపద్ధతికి కారణయుక్తముగా నొకవిషయము నిర్ణయించుటకు ఒక లక్ష్యము చూడనగును. వారి తత్త్వదర్శనమునకు లక్ష్యము ముక్తి - నిశ్శ్రేయసము - అపవర్గము - నిర్వాణము నని చెప్పనగును. ముక్తి - మోక్షము - అపవర్గము - నిశ్శ్రేయసము - నిర్వాణము నను నీ మాటలకు జీవుడు జన్మజరామరణ రూపబంధనములనుండి విడివడి త్రివిధములగు దుఃఖములకు దూరుడై ఆనందమున - శాశ్వతసుఖమున నోలలాడుట యని సామాన్యార్థము చెప్పవచ్చును. ప్రాచ్యతత్త్వజ్ఞులెల్లరు బుద్ధాదులు సైతము ఇట్టి పరమలక్ష్యమును సాధించుటకే తత్త్వమును - యథార్థమును తెలిసికొనుటకు జీవితముల నొడ్డిరి. ప్రాణాంతము తపశ్చర్యల నొనరించిరి. వారి తత్త్వాన్వేషణమున కదియే పరమావధి - పరాకాష్ఠ.

పాశ్చాత్య తత్త్వవేత్తలు కాంట్, హేగిల్ మున్నగువారు తత్త్వము నన్వేషించియున్నారు. వారి తత్త్వాన్వేషణమునకు లక్ష్యము కలదా? తత్త్వము నన్వేషించుటయేకాక మఱియొండు లక్ష్యమున్నదని నే నెంచను.

ఇట నేటి హేతువాదుల లక్ష్యముకూడ సాధ్యకోటిలోనే యుండ వచ్చునని యెంచెద. వీరి హేతువాదమునకు లక్ష్యముండు ననుట సంభవము కాదేమో! ప్రపంచపు భవిష్యత్తేమో యెవరికి తెలియును? దీని వికాసమునకు నిలుకడ యనునది యొకటి యున్నదా? నేటికి లేదు; ముందేమో తెలియదు. నిత్యపరిణామము, నిత్యవికాసము గల ప్రపంచమున కొకయెడ నిలుకడ యెట్లుండును? ఒకవేళ నిలుకడ కలిగినచో హేతు వేమగును? హేతువాద మంతటితో నాగి పోవునా? అను ప్రశ్నములు హేతువాదమున సమాధేయములుగా నుండిపోవును.

భారతీయ తత్త్వవేత్తలకు హేతువు - కారణము (Reason) తత్త్వనిర్ణయమున కొక సాధనము మాత్రమే. హేతువే సర్వము కాదు. బ్రహ్మాండమున గల వస్తువుల యునికి రెండు విధముల సిద్ధించునని వారెంచుదురు. అందొకటి లక్షణము. రెండవది ప్రమాణము. (లక్షణ

ప్రమాణాభ్యాం వస్తుసిద్ధిః) లక్షణమును ఇంగ్లీషులో డెఫినిషన్ లేక కన్సెప్షన్ (Definition or Conception) అనియు చెప్పవచ్చును. ఇట్టి లక్షణ ప్రమాణముల మూలమున వస్తు యాథార్థ్యమును నిర్ణయించు ప్రక్రియలో హేతువున కొక స్థానముకలదు. సత్యమును దెలిసికొనుటకు, సిద్ధాంత నిర్ణయమునకు హేతువు - కారణవాద మెంతయు తోడ్పడును. హేతువునకు తర్కము, ఊహాయనియు నామాంతరములున్నవి. తర్కసహాముకానిది హేతుసిద్ధముకానిది సత్యముకాదు. కావున సత్యనిర్ణయము చేయువారు తప్పుత్రోవల పోకుండ కాపాడుటకు హేతువాదమెంతయు తోడ్పడును. అంతమాత్రమున హేతువే సర్వస్వమని యెంచరాదు.

అందువలననే ప్రాచీన తత్త్వవేత్తలయిన కణాద గౌతమాదులును తమ దర్శనసిద్ధాంతములను తర్కబద్ధముగా నిర్ణయించిరి. వ్యాసుడు బ్రహ్మమును హేతుబద్ధముచేయదలచి 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అని వేదాంతదర్శనమును, జైమిని మహర్షి 'అథాతో ధర్మమీమాంసా' అని మీమాంసా దర్శనమును ప్రారంభించియున్నారు. ఇందు జిజ్ఞాస, మీమాంస పదములు గమనింపదగినవి. హేతుపూర్వకముగ విచారించుట జిజ్ఞాసలేక మీమాంస యందురు. ఇక ప్రకృతి పురుషవివేకఖ్యాతి (జ్ఞానము) తాపత్రయ విఘాతమునకు హేతువని కపిలుడు, చిత్తవృత్తి నిరోధమనెడి యోగము కైవల్య సాధనమని పతంజలియు నిర్ణయించియున్నారు. గౌతముడు పదార్థ తత్త్వ జ్ఞానము మోక్షమునకు ముఖ్యహేతువని నిర్దేశించుచు పదార్థములను ప్రమాణ ప్రమేయాదులను పదునాఱుగా లెక్కించుచునందు తర్కము - హేతువు (logic) కూడ నొక పదార్థముగా గణించియున్నాడు. కణాదుడు ద్రవ్యగుణ కర్మలను ప్రధాన ద్రవ్యములుగా నంగీకరించి వానిని సాధర్మ్య వైధర్మ్య పురస్సరముగా వివరించి యెఱుగుట మోక్షసాధనమని పదార్థవిజ్ఞానమును బోధించియున్నాడు.

ఇట్లు ప్రాచీన మహర్షులు హేతుబద్ధముగా విచారించి నిర్ణయించిన విషయములలో చేరక మిగిలిన పదార్థ విజ్ఞాన మేముండును? పై విషయములలో బ్రహ్మాండ గత పదార్థ విజ్ఞానమంతయు నిమిడియే యున్నది. ఈ దర్శనము లన్నియు కల్పిత విషయములను గూర్చిన ఊహాలు (Speculations) మాత్రముకావు. వేదాంతము ప్రపంచమునకు (First

cause of the universe) మూలకారణమైన బ్రహ్మమును; న్యాయవైశేషికములు భూమ్యాది పంచభూతములు, కాలము, దేశము, ఆత్మ, మనస్సు నను తొమ్మిది ద్రవ్యముల (Substances)ను, శబ్ద స్పర్శ రూప రస గంధ సంఖ్యా పరిమాణ పృథక్త్వ (Individuality) సంయోగ వియోగాదులు - బుద్ధి సుఖ దుఃఖేచ్ఛాద్వేష ప్రయత్నములు నను గుణములను గూర్చియు; సాంఖ్యము ప్రకృతి, మహత్తత్త్వము (Intellect), అహంకారము (Selfsense), ధ్వని, స్పర్శ, గంధము, రసము, రూపము (Form), పంచేంద్రియములు, మనస్సు, అంతమున పురుషుడునను నీతత్త్వములను గూర్చియు; యోగము యమనియమాద్యష్టాంగములను గూర్చియు; పూర్వమీమాంస యజ్ఞయాగాది క్రతువులను గూర్చియు నెంతో హేతుబద్ధముగ విచారించియున్నవి. వీనిలో చేరక మిగిలియున్న పదార్థ విజ్ఞానము (Science) ఏ మున్నది? తత్త్వశాస్త్రము లన్నియు పదార్థ విజ్ఞానమును గూర్చికాక మఱి దేనిని వివరించి యున్నవి! సాంఖ్యాదులు జ్ఞానము కలుగనిచో ముక్తిలేదను చున్నారు. ఈ జ్ఞానము దేనికి సంబంధించినది? ప్రకృతి (Matter) పురుష (Soul)లకు సంబంధించినదే కదా! అది నేడు మనము ప్రస్తుతభాషలో చెప్పు కొను విజ్ఞానము (Science) కదా! బయాలజీ, అనాటమీ మున్నగున వన్నియు ప్రకృతి విజ్ఞానమునకు చెందినవి కావా? పైన చూపిన ప్రాకృతిక పదార్థ విజ్ఞానము లేకుండుట అవిద్యకాదా? అది బంధనమునకు - మానవ దుఃఖములకు హేతువుకాదా? ఆత్మవిజ్ఞానము, ప్రాపంచిక పదార్థ జ్ఞానమునను పరాపర విద్యల నెఱిగి అపరవిద్యతో మృత్యువును తరించి పరవిద్యతో ఆనందము ననుభవించుననుట తత్త్వజ్ఞుల తత్త్వాన్వేషణకు ఫలము కాదా?

ప్రపంచమున మన యింద్రియగోచరములగు పదార్థముల రూపములు వాస్తవములుకావని ఆలోచనకలవారికి తెలియును. ఈ కనబడురూపములు నేడొక విధముగనుండి సమయాంతరమున మాఱిపోవుచుండును. కావున దార్శనికుడు - తాత్త్వికుడు కనబడువస్తువుల స్థూలరూపము నాధారముగా తీసికొని వాని సూక్ష్మరూపమును, వాని వాస్తవికస్థితిని దెలిసికొనుటకు యత్నించును. తత్త్వజ్ఞానమిదియే. నేటి వైజ్ఞానికుడు (Scientist) చేయుపనియు నిదియేకదా! ఒక స్థూలపదార్థమును విజ్ఞానశాలలో

సాధనసామగ్రి సాహాయ్యముతో విభజించి దాని మూలతత్త్వములను దెలిసికొనును.

ప్రకృతివాదులు ప్రాకృతికపదార్థముల పరిశోధనతోనే తృప్తిబొందుదురు. ప్రాకృతిపదార్థ విజ్ఞానమునకు మించి యొండేమియు లేదందురు. మన యింద్రియములకు, సూక్ష్మసాధనలకు నందని దానిని గూర్చి విచారించుటయే వారికి వ్యర్థముగాతోచును. ప్రాకృతికపదార్థములందుగల సామాన్యనియమములు (General Laws), ఆ యాదృశ్యపదార్థములకుగల సంబంధములు వెల్లిగిన చాలునని యెంచెదరు. అంతకుమించి యింద్రియగమ్యముకాని విషయమునుగూర్చి యాలోచించి ప్రయోజనము లేదందురు. కాని వివిధ ప్రాకృతికపదార్థములందు గనిపించు సామాన్యనియమములకు సంబంధించిన సూత్రములు, పదార్థములకు పదార్థజ్ఞాతలకుగల సంబంధములు, ఇతర సూక్ష్మవిషయములు తాత్త్వికుడే గుర్తింపగలడు. కేవల ప్రకృతివాదు లా పరిశ్రమకు వెఱచి దూరముగా నుందురు.

దయానందుని తత్త్వజ్ఞానమేదో యొకశాఖకు సంబంధించినది మాత్రము కాదు. అతడు సంపూర్ణజ్ఞానము నారయువారిలో నొకడు. అతడు యథార్థవాది. పతంజలి నిర్వచించిన అవిద్యతో నతడేకీభవించును. జ్ఞానమననేమి? అజ్ఞానమననేమి? అతడిట్లు నిర్వచించును. అనిత్యమును అనిత్యమనియు, సత్యమును సత్యమనియు, అశుచిని అశుచియనియు, శుచిని శుచియనియు, దుఃఖమును దుఃఖమనియు, సుఖమును సుఖమనియు, అనాత్మను అనాత్మయనియు, ఆత్మను ఆత్మయనియు నంగీకరించుట జ్ఞానము - విద్యయగును. దానికి విరుద్ధముగా అనిత్యమును, అశుచిని, దుఃఖమును, అనాత్మను వరుసగా నిత్యము, శుచి, సుఖము, ఆత్మయని అంగీకరించుట అజ్ఞానము - అవిద్య (Ignorance) యగును. ఉన్నది యున్నట్లంగీకరించుట యథార్థజ్ఞానము; విపరీతముగా నంగీకరించుట విపరీతజ్ఞానము, మిథ్యాజ్ఞానము, అజ్ఞానము ననబడును. ఇట్లు దయానందుని దృష్టిలో ఆత్మానాత్మలకు. నిత్యానిత్య పదార్థములకు చెందిన చర్చ - హేతుబద్ధమైన ఆలోచన - అధ్యాత్మము (Metaphysic) అనబడును. శుచి అశుచి, నీతి అనీతికి సంబంధించిన చర్చ నైతిక విజ్ఞానమగును (Ethics). ఇక సుఖదుఃఖములకు సంబంధించినచర్చ యంతయు మనోవిజ్ఞానము (Psychology) అనబడును.

తత్త్వజ్ఞానము కలుగనిది జీవులకు బంధవిముక్తిలేని మాట నిజము. కాని దయానందుడు ఆచరణతో యుక్తము కాని జ్ఞానము - కార్యరూపమున పరివర్తింపని జ్ఞానము నిరుపయోగమని నొక్కి వక్కాణించును. అతని దృష్టిలో జ్ఞానమును కార్యరూపమున బరిణమింప జేయుటయే ధర్మమనబడును. విశ్వస్త సిద్ధాంతముల కనుగుణ జీవనమే ధర్మము. కావుననే కణాదమహర్షియు ధర్మమును నిర్వచించుచు అభ్యుదయ నిశ్శ్రేయసములకు సాధనము ధర్మమని నుడివియున్నాడు. "యతో భ్యుదయ నిశ్శ్రేయస సిద్ధిః స ధర్మః" (వై.ద.) అభ్యుదయ మన మానవుడు సంపాదించు ఐహికాముష్మికాభివృద్ధి (a life of magnanimity) అని యర్థము. నిశ్శ్రేయసమన బంధవిముక్తి (The freedom from world bandage), వేదము కూడ నిట్లే బోధించినది.

"విద్యాం చావిద్యాం చ యస్త ద్వేదోభయం సహ
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే."

యజు.40-41

'విద్యావిద్యల యథార్థజ్ఞాని అవిద్యవలన మృత్యువును జయించి విద్యవలన అమృతత్వమును బొందును' అని మంత్రాభిప్రాయము. వాస్తవమున నెవడు ఒకే సమయమున విద్యావిద్యల యథార్థజ్ఞానమును సంపాదించి సదాచారియై వర్తించుచు దివ్యోపాసన నొనర్చునో వాడు అవిద్యవలన మృత్యువును జయించి విద్యవలన అమృతత్వమును సంపాదించునని తాత్పర్యము; సద్వర్తనము, యథార్థజ్ఞానము, ఏకేశ్వరోపాసనము మోక్షమునకు - బంధన విముక్తికి సాధనములని భావము. దానిని దయానందుని భాషలో నుడివినచో అవినీతితో గూడిన జీవనము - అసద్వర్తనము - ఏకేశ్వరోపాసనకు బదులు విగ్రహాది జడపదార్థముల పూజనము విపరీతజ్ఞానము ననునవియే జీవుని బంధనమునకు హేతువులని చెప్పనగును. మనుజు డెల్లపుడు నేదో చేయుచుండును. ఏదియో నిరంతరము ఆలోచించుచుండును. జ్ఞానము నార్జించును. కావున సత్కర్మల నాచరించుచు మాటలలో సత్యమును పాటించుచు, అసత్యమును తెగనాడుచు నుండుటయే మానవ విముక్తికి సాధనములని దయానందుని విశ్వాసము.

వైజ్ఞానికుడు (Scientist) తన విజ్ఞానక్షేత్రమున నెఱుగగలిగిన దెంత యుండును? పదార్థవిశ్లేషణమున నిరంతరము ప్రయత్నించి కొండొక సూక్ష్మతత్త్వము నన్వేషింపగలడు. అదియు ప్రాకృతికపదార్థములకు సంబంధించినంత వఱకు మాత్రమే. అప్రాకృతికపదార్థము లతని క్షేత్రమునకు సంబంధించినవి కావు. కొంతమేరకు పరీక్షణలుచేసి ఆపైన దిక్కుతోచక ఆగిపోవలసినదేకదా? అందువలన నతనికి దెలిసిన దానికంటె తెలియని ప్రపంచ మెంతయో యున్నదనుట నిర్వివాదసిద్ధాంతమేకదా! వైజ్ఞానికుడు తన పరీక్షణలలో ననేకస్థలముల నూహలమీద నాధారపడక తప్పదు కదా! నిర్హేతుకములయిన కల్పనల (Hyphothesis) మీద నాధారపడి కదా ముందుకు నడుపవలసివచ్చును! అయినను నతని యూహలకుకూడ నందని ప్రపంచ మెంతయో మిగిలియుండుననుట సత్యముకాదా!

ధర్మము నిరాశాపూరితమగు నన్వేషణకు ఫలితముకాదు. ఆశాపూరితలక్ష్యమున కది సాధనము. అది యెల్లరకు నందని పండుకాదు. ధర్మము మానవునకు యథార్థజ్ఞానము నొడగూర్చును. తత్త్వజ్ఞానము కేవలము బౌద్ధికతృప్తికాదు. తత్త్వజ్ఞానమువలన యథార్థత, సత్యము ధార్మికున కనుభవ సిద్ధమగును. అధ్యాత్మవిజ్ఞానము వాస్తవమున నీ ప్రపంచము మిథ్య - అయథార్థ మగుచో దానినుండియు విముక్తిని కలిగించును. అట్లు కాక ప్రపంచము నిత్యసత్యమగునెడల నందు జీవించుటకేదైన ప్రయోజన ముండవలయును. దానినిగూడ సంపాదింపజేయున దీ యాధ్యాత్మికజ్ఞానము.

తత్త్వజ్ఞానముతోను, తత్త్వాన్వేషణములతోను జీవితమునకు సంబంధము లేనినా డవి నిరర్థకములు. వానిని జీవిత మూలమున బ్రదర్శించుటయే ధర్మమగును. కావుననే దయానందుడు ధర్మము నిట్లు వర్ణించియున్నాడు.

"According to me, all that is beyond prejudice, reasonable, truthful, in accordance to the divine tenets, the Veda is Dharma".

అర్యుల క్రమశిక్షణ ననుసరించి ఉత్తమ సదాచారి, విశ్వాసపాత్రుడు, నిస్సందిగ్ధమైన సత్యవాది, మూఢవిశ్వాసములు దురభ్యాసములు లేనివాడు, తాను చెప్పినదాని నాచరించునని నమ్మదగినవాడు మాత్రమే

తత్త్వజ్ఞానమును సంపాదింప నర్హుడగును. ధర్మము నాచరింపనివాడు తత్త్వజ్ఞానము నభ్యసింప నధికారియుకాడు. ధర్మాచరణపరుడు కాని వాని తత్త్వజ్ఞానము (Philosophy) క్రూరుని చేతికిచ్చిన శస్త్రము నాశనహేతువైనట్లు మానవులకు ఉపద్రవకరమగును. నేటి అనాచారుల కలవడిన భౌతిక విజ్ఞానమువలన మానవాళికి కలుగు కష్టనష్టములను ప్రత్యక్షముగ జూచుచున్నాము గదా! అధార్మికుడు, అనాచారియునగు హేతువాది యొక్క విజ్ఞానము కూడ మానవతకు తోడుపడదు. దయానందుని యున్నత జీవితము, అతడు మానవజాతికి చేసిన ఉపకారము, అతని నిష్కళంక మగు తపశ్చర్యతో గూడిన సద్వర్తనము నన్నియు అతడొక నిజమైన సత్యాన్వేషకుడనియు, గొప్ప తత్త్వవేత్తయనియు, అనితరసాధారణ హేతువాది యనియు ఋజువు చేయును. అతని వేద సిద్ధాంతములు హేతువాద సిద్ధములు కానివి కావు. అవి విజ్ఞాన విరుద్ధములు కావు. అంధవిశ్వాసముల నతడంగీకరింపడు. తర్కానుసంధానము కాని దతనికి ధర్మము కాదు. అతని దృష్టిలో వేదరచన బుద్ధిపూర్వకము. 'బుద్ధిపూర్వా వాక్యకృతిర్వేదే' అనునది మహర్షి సూక్తము. బైబిల్ కురానులలో వలె విజ్ఞాన విరుద్ధములైన సిద్ధాంతములు వేదమున నున్నట్లు దయానందు డంగీకరింపడు.

ఎంత గొప్ప బుద్ధిమంతుడైనను నొక వ్యక్తి సర్వజ్ఞుడు కాడు. అతని నిర్ణయములు ప్రమాద జనితములు కావచ్చును. ఒక వ్యక్తి తన సిద్ధాంతములకు సాధనములుగా గ్రహించు హేతువులు మఱియొక కుశాగ్రబుద్ధికి అహేతువులు హేత్వాభాసములు కావచ్చును. కాని వేదసిద్ధాంతము లట్టివి కావని దయానందుని మతము. వేదములు సత్యసిద్ధాంతములకు, సత్యవిద్యలకు నిలయములని దయానందుని యభిప్రాయము. వేదము ఈశ్వరీయజ్ఞానము. అతడు తన వేదభాష్యమున నీ విషయములను హేతుబద్ధముగా ఋజువుచేయ ప్రయత్నించి యున్నాడు. అతనికి పూర్వులు సాయణాదులు వేదములకు వ్రాసిన భాష్యముల నాధారముగా తీసికొని మోక్షమూలర్ మున్నగు పాశ్చాత్య విద్వాంసులు వేదసిద్ధాంతములపై జేసిన దోషారోపణల నన్నిటికి సమాధానములు చెప్పి దయానందుడు తన భాష్యము మూలమున వేదప్రాశస్త్యమును స్పష్టపఱచి యున్నాడు.

అంతేకాక వారికి వేదభాష తెలియదనియు, వేదసిద్ధాంతముల నెఱుగదగు ధార్మికజీవనము వారిలో లేదనియు స్పష్టపఱచియున్నాడు. వేదము లీశ్వరీయములు - సర్వజ్ఞప్రేరిత విజ్ఞానరూపము లగుటవలన నందు భ్రమ ప్రమాదములకు తావులేదనియు, ప్రాకృతిక నియమములకు విజ్ఞానమునకు విరుద్ధ సిద్ధాంతముల కట లేశమాత్రము స్థానము లేదనియు, నతని నిశ్చితాభిప్రాయము. వేదములు ప్రదీపమువలె స్వతః ప్రమాణములు. మానవబుద్ధి దీపము వంటిది. ప్రదీపము చూపని దానిని దీపమెట్లు చూపును! బుద్ధివాది బుద్ధికి అవధులు లేకపోవు. అతని బుద్ధియే ప్రమాణమగుచో మానవతకు హానికలుగ దని యెట్లు చెప్పగలము! కావున దయానందుడు వేదవాది యైనంతమాత్రమున హేతువాది కాదనరాదు.

ఓమ్ తత్ సత్

# శంకర పీఠాధిపతులు

## అంటరానివారు

భారతదేశమునం దిప్పుడు ఎనుబదికోట్ల జనులు నివసించుచున్నారు. వీరు పలుమతములకు చెందినవారు. హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, జైనులు, బౌద్ధులు, పారసీకులు, వీరిలో హిందువులు అధిక సంఖ్యాకులు. మిగిలిన అన్ని మతములవారు అందఱు కలిసిన హిందువుల సంఖ్యలో నాల్గవవంతుకు సరిపోవుదురని చెప్పవచ్చును. మహమ్మదీయ మతము, క్రైస్తవము విదేశీయములు, పారసీకముకూడ విదేశీయమే. హిందూ బౌద్ధ జైనమతము లీ దేశమునకు జెందినవియే. క్రైస్తవమతమువారిలో కొలది కుటుంబములవారు తక్క మిగిలినవారెల్లరు భారతీయులే యనుట మఱవరాదు. కాని ప్రస్తుతము హిందువులలో నున్న కులభేదములు, జాతిభేదములు, ఆచారభేదములు లెక్కకు మిక్కిలి గానున్నవి. ఇతర మతములవారిలోను కొన్నిభేదములు లేకపోలేదు. కాని హిందువులలో ఎన్నిభేదము లున్నవో అన్ని యితరులలో లేవనుట నిక్కవము. ముఖ్యముగా ఇతర మతములం దెక్కడను లేని అంటరాని తనము హిందువులలోనే చూడ వగును. మానవులలో కొందఱు అంటరానివారుందురను విషయము హిందూమతమువారే యంగీకరింతురు.

భారతదేశమున నేడు హిందువులనబడువారు పూర్వము ఆర్యులనబడుచుండెడివారు. మహమ్మదీయ పరిపాలనకాలములో భారతదేశమును హిందూదేశమనియు, భారతీయులను హిందువులనియు పిలువ నారంభించిరి. అంతకుపూర్వ మీ దేశము ఆర్యావర్తము, ఇక్కడ నుండువారు ఆర్యులు అనబడెడివారు. కావుననే భారతీయప్రాచీనసాహిత్యమున హిందూ పద మెక్కడను కనిపింపదు. వేదములు మొదలు పురాణముల వఱకుగల సాహిత్యమున నెల్లయెడల ఆర్యపదమే చూడనగును. ఇతర దేశవాసులు వ్రాసిన చరిత్ర గ్రంథములలో ఆర్యులు ఇరాన్ మధ్యఏషియాలనుండి

వచ్చిరని వ్రాసిన వ్రాతలన్నియు నిరాధారము లనక తప్పదు.

ఆర్యులకు ధర్మగ్రంథము వేదము. వేదవిహిత ధర్మములనే ప్రాచీనార్యు లాచరించెడివారు. నేటి హిందువులకును వేదములే ధర్మాది విషయములందు పరమ ప్రమాణములు. ఆర్యులలో వేదముల ప్రచారము విరివిగా నున్నంతకాలము వారిలో జన్మగత జాతి భేదములు పాటింపబడినట్లు కనిపింపదు. కాని ఆర్యులు గుణవైశిష్ట్యము కారణముగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రనామములచే పిలువబడుచున్నట్లు తెలియనగును. ఈ వ్యవహారము వారిలో వేద మూలక మన నగును. వేద మంత్రములలో బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర పదములు ప్రయోగింపబడి యున్నవి. కాని ఆ పదములతో జాతిపదముకాని వర్ణపదముకాని కలిపి బ్రాహ్మణజాతి - బ్రాహ్మణవర్ణము అనికాని, ఇట్లే క్షత్రియజాతి - క్షత్రియవర్ణము అని కాని యెక్కడను మంత్రములందు ప్రయోగించుట చూడము. కావున బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర పదములు జాతి వాచకములనికాని, వర్ణవాచకములని కాని చెప్పవలనుపడదు. కావున నవి గుణవాచకములనియే చెప్పవచ్చును.

"బ్రాహ్మణో స్యముఖ మాసీత్" అను నిట్టి మంత్రవర్ణములను బట్టి బ్రాహ్మణుడు మానవజాతికి ముఖము, క్షత్రియుడు బాహువులు, వైశ్యుడు ఊరువులు, శూద్రుడు పాదములు ననదగియున్నారని బోధపడును. ఒక దేహమునకు ముఖాదులవలె మానవులెల్లరు ఒక్కజాతికి చెందినవా రనుటలో నెవరికి నెట్టి సందేహము నుండదని యెంచెద.

ప్రాచీన న్యాయశాస్త్ర కర్తయగు గౌతమమహర్షి జాతి అకృతిచే గ్రహింపబడుటచే "అకృతిగ్రహణా జాతిః" అని జాతిలక్షణము చెప్పియున్నాడు. ఏదేశమున బుట్టినను ఏభాష మాట్లాడినను, ఏమతమునకు జెందినవాడైనను మానవుడు అకృతిచే మానవుడుగా గ్రహింపబడును. కావున మానవత్వ మొకజాతియని శాస్త్రకారు లభిప్రాయపడుచున్నారు.

బ్రాహ్మణ క్షత్రియాది పదములచే పిలువబడు వ్యక్తులు ఎల్లరు మానవజాతికి చెందినవారే యగుదురు. కావున బ్రాహ్మణత్వక్షత్రియత్వాదులు జాతులు కావు. బ్రాహ్మణ క్షత్రియాదులు వేఱువేఱుజాతులవారుకారు.

అకృతినిబట్టి మానవులనియే గుర్తింప గలుగుదుమే కాని వీరు బ్రాహ్మ ణులు, వీరు క్షత్రియులు, వీరు వైశ్యులు, వీరు శూద్రులు నని గుర్తింప నెవరికిని శక్యము కాదు. ఇంతేకాక శాస్త్రములందు జాతిని గుర్తించు టకు "సమాన ప్రసవాత్మికా జాతిః" అని మఱియొక లక్షణముకూడ చెప్పియున్నారు. ఒకేజాతికి చెందిన స్త్రీ పురుషులు కలిసి తమవంటి సంతానమును కందురు. భిన్నజాతులకు జెందిన స్త్రీ పురుషవ్యక్తులు కలిసి తమవంటి సంతానమును కనజాలరు. గోవు సింహము కలిసి సంతానము కనుట అసంభవము, కారణము అవి రెండును భిన్న భిన్న జాతులకు సంబంధించిన వగుటయే. అట్లే మానవులు బ్రాహ్మణ క్షత్రి యాదినామములచే పిలువబడువారు భిన్న భిన్న జాతులవా రగుచో బ్రాహ్మణ స్త్రీ, శూద్రపురుషుడు కలిసి తమవంటి సంతానమును కనజాల నివారు కావలసియుందురు. కాని వారిరువురు మానవజాతికే చెందినవారే యగుటచే నిరువురు కలిసి తమవంటి సంతానము కనగలుగుదు రనుట యెల్లరెఱుగుదురు. శ్రీ సి. రాజగోపాలచారి బ్రాహ్మణు డనబడుచు న్నాడు. ఆయన కుమార్తెను వైశ్యకులజుడైన గాంధిగారి కుమారుడు దేవదాసుగాంధి పెండ్లి చేసికొని పిల్లలను తమవంటి మంచివారిని గనుట నెవరెఱుగరు ? కాబట్టి వైశ్యులు బ్రాహ్మణులు ఒకేజాతివా రనుటలో నెట్టిసందియము లేదు. ఇట్లు బ్రాహ్మణక్షత్రియాదినామములచే పిలువబ డువా రెల్లరు మానవజాతికి జెందినవారే కాని పరస్పరము భిన్నజాతులకు చెందినవారు కారు. హిందువులలో కొందఱు అంటరానివారని యెంచబ డుచున్నారు. వారెవరు? వారును మానవులే. కాని మాల, మాదిగ, చర్మకారాది నామములచే పిలువబడువారిని హిందువులు అంటరానివా రందురు. వీరికీ యంటరానితన మెటనుండి వచ్చినది? అంటరాని తనము నంగీకరించువారిలో బ్రాహ్మణులు అగ్రగణ్యులు. క్షత్రియాదులు వారి ననుసరింతురు. కావున వారు తరువాత లెక్కింపదగుదురు.

హిందువులలో బ్రాహ్మణక్షత్రియాది నామములచే పిలువబడువారు జన్మచేతనే బ్రాహ్మణక్షత్రియాదులు భిన్నజాతులవారని యెంచుచున్నారు. అంతేకాక బ్రాహ్మణులు తక్కినక్షత్రియాదులకంటె నధికులనియు క్షత్రి యాదులుకూడ క్రమమున నొకరికంటె నొకరెక్కువ యనియు నెంచు

చున్నారు. శూద్రులు అందరికంటె తక్కువ. వారిలోకూడ ననేకాం తర్భేదములు కల్పించుకొని హెచ్చుతగ్గులు పాటించుచున్నారు. మాల మాదిగలు అంత్యజులనియు వారి నంటరాదనియు వ్యవహరించుచున్నారు ఈ వ్యవస్థ కంతటికి భారతదేశమున బ్రాహ్మణులు, వారిలో నాచార్య స్థానము వహించిన పీఠాధిపతులు మిక్కిలిగా ఉత్తరదాతలై యున్నారు. మిగిలిన వారు బ్రాహ్మణుల ననుసరించువారునై యున్నారు.

'వర్ణానాం బ్రాహ్మణో గురుః' అన్నివర్ణములవారికి బ్రాహ్మణులు గురువులనియు, వారు చెప్పినట్లు తక్కినవారు నడుచుకొనవలయున నియు హిందువులు సామాన్యముగ నంగీకరింతురు. ఇప్పు డిప్పు డీ వ్యవస్థలో కొంత అస్తవ్యస్తత యేర్పడినను ఇంతకు కొంతకాలమునకు పూర్వ మీ భావము హిందువులలో గాఢముగా హత్తుకొనియుండెడిది. నేటికిని భారతీయ హిందువులలో బ్రాహ్మణు లనబడువారికే పలుకుబడి యెక్కువ. వారు చెప్పినదే వేదముగా నెంచి యాచరించువారు హిందు వులలో నూటికి తొంబది (90) మందికి తక్కువ యుండరు. నేటికిని బ్రాహ్మణులలో కొందఱు విద్వాంసులు, పీఠాధిపతులైన జగద్గురువులని పిలువబడు శంకరాచార్యాదులు జన్మతో బ్రాహ్మణులు తక్కినవారికంటె నెక్కువనియు, మాలమాదిగలు జన్మతో నంటరానివారనియు చెప్పుచునే యున్నారు. సంస్కృత గ్రంథములందును నిట్టి భావములనే చొప్పించి చాలకాలముగా నీ వ్యవస్థ నాచరణములో నుంచుచు వచ్చినట్లు కన్ప ట్టును.

'స్త్రీశూద్రా నాధీయాతామ్' స్త్రీలు శూద్రులు వేదము చదువ రాదు. 'శ్మశానవ చ్ఛూద్రః, తస్మాత్ శూద్రసమీపే నాధ్యేతవ్యమ్' శూద్రుడు శ్మశానమువంటివాడు. కావున శూద్రునిసమీపమున వేదము చదువరాదు. "వేద ముపశృణ్వత స్తస్య కర్ణౌ త్రపుజతుభ్యాం పూర యేతామ్" "ధారణే జిహ్వాచ్ఛేదః" వేదమును విను శూద్రునిచెవులు సీసముతోను లక్కతోనునింపవలయును. ఉచ్చరించినచో నాలుక నుత్తరిం చవలయును. అను నిట్టి ఆజ్ఞలు, దండనలు సంస్కృత పుస్తకములందు నేటికిని జూచుచున్నాము.

విద్వత్ బ్రాహ్మణులు, పీఠాధిపతులును మాలమాదిగలను తమ చెంగట నిలువనీయరు. ఇక తాకుట కవకాశమెక్కడ లభింపగలదు?

ఏబది సంవత్సరములకు పూర్వము ఇరువైపుల బ్రాహ్మణు లనువా రియిండ్లున్న గ్రామవీథులలో మాలమాదిగలు నడువ వీలుండెడిది కాదు. ఆ వీథులనుండి మాలమాదిగలు నడచినచో బ్రాహ్మణులు, వారియిండ్లు మైలబడిపోవుచుండెడివి. ఇతరవీథులలోను, రోడ్లమీదను మాలమాదిగలు బ్రాహ్మణుల కెదురువచ్చుట సంభవించినచో వారిఛాయ బ్రాహ్మణులమీద పడకుండునంత దూరముగ వెళ్ళవలసియుండెడివారు. మాలమాది గలు నడచినరోడ్డు మీద బ్రాహ్మణస్త్రీలు మడినీళ్ళు తెచ్చుకొనుచున్నా మనునెపముతో నేలమీద నీళ్ళు చల్లుకొనుచుండెడివారు. ఎవరైనను తెలియక మాలవాడు గాని మాదిగవాడు కాని బ్రాహ్మణులకు నాలు గైదు గజముల దూరముగా వెళ్ళుటకూడ తప్పుగానెంచి వానిని దండింప స్వయముగా చేతగాని వారై, కోతి పిల్లిచేతితో జీడిగింజలు తీయించు నట్లు గ్రామములో నుండు కమ్మ వెలమ రెడ్డిదొరలకు జెప్పి వారిచే దండింపజేయుచుండెడివారు.

ఇట్లు బ్రాహ్మణుల అత్యాచారములు కొంతకాలము - ఎంతకాలమో చెప్పలేము. కాని నిరాటంకముగ నడచినవి. ఇప్పుడు అట్టి అత్యాచార ములు తగ్గిపోయినవి. రోజులు మాఱినవి. ఆంగ్లేయులు - క్రైస్తవులు మాలమాదిగలను దగ్గఱకు తీసివారిని క్రైస్తవులను చేసినారు. ఆంధ్రగ్రా మములలోని మాలమాదిగలెల్లరు క్రైస్తవులయినారు. ఇట్లు మతాంతర ములను స్వీకరించిననాటినుండి బ్రాహ్మణులు వారికి భయపడి తామే స్వయముగా నంటరానివారివలె మాలమాదిగలకు దూర మేగసాగిరి. మాలమాదిగలుగా నున్నవారిప్పటికిని బ్రాహ్మణులకు భయపడి దూరముగా నుండుట మానరైరి. ఉత్తరభారతమున దయానందుడు చేసిన వేదధ ర్మప్రచారము కారణముగా నీయంటరానితనము కొంత రూపుమాసినది. గాంధి మున్నగు దేశనాయకులు చేసిన ఆందోళనాదులు కారణముగా దక్షిణదేశముననను కొంతవఱకు అంటరానితనము తగ్గిపోయిన దనవ చ్చును. వాస్తవమున నెక్కువమార్పు రైళ్ళవలనను, హోటళ్లవలనను, స్కూల్ కాలేజీలవలనను వచ్చినదనుట న్యాయ్యమగును. స్వరాజ్యము

వచ్చినతదుపరి యేర్పడిన భారతీయసంవిధానమువలనను అంటరానితన మొకింత తగ్గినదేమో యనవచ్చును. కాని హిందువులలో ఇప్పటికిని అంటరానితనము పోయినదని చెప్పశక్యము కాకున్నది. ఈ యంటరాని తనము పోకుండ కాపాడువారెవరు? దీనికి నా సమాధానము బ్రాహ్మ ణనామధారులు. వారిలో అందఱు కాకపోయినను కొందఱు పండితులు, శ్రోత్రియులమని చెప్పకొనువారు ఈయంటరానితనమును శాశ్వతముగా హిందువులలో నాటుకొనియుండునట్లు యత్నించుచునే యున్నారు. ఇక వారి ఆచార్యులసంగతి చెప్పనక్కఱయే లేదు. ఆదిశంకరులు వేదమ తము నుద్ధరించుటకు కాపాడుటకు నేర్పఱచిన పీఠములు, పీఠాధిపతులు మాలమాదిగలను చూచుటయు దోషావహమందురు. మాలమాదిగలు స్వాములను దర్శింప నర్హులేకారు. ఎప్పడైన మాలమాదిగలు ఆచార్యు లదర్శనము చేసికొనుట సంభవించినపక్షమున ఆచార్యులు ప్రాయశ్చితము చేసికొనవలసిన వారగుదురు. నూర్లకొలది స్నానములు చేసినకాని వారు శుద్ధులు కారు. ఇట్టి నియమాలు కామకోటి పీఠాధిపతులు మిక్కిలిగా పాటింతురనియు అందువలననే వారిలో నెక్కుడు మహత్తు కలదనియు నెందఱో చెప్పగా వినుచున్నాము. దీనినిబట్టి చూచిన హిందువులలో అంటరానివారి కీ పీఠాధిపతులు మిక్కిలి భయపడుదురని తోచెడివి. అందఱు నీయంటరానితనము విడిచిపెట్ట సమకట్టినను శ్రోత్రియబ్రా హ్మణులు, వారి గురువులైన పీఠాధిపతులు నీయంటరాని తనమును విడువనీయరు. వారు హిందువులకు ఆదర్శ మూర్తులు. హిందువుల ధర్మమునకు ప్రమాణపురుషులు.

ఈ యంటరానితనము కారణముగా కోట్లకొలది హిందువులు మతాం తరులైనారు. మతాంతరులైనవారిలో హిందువులయెడ సద్భావము నామ మాత్రమునకైనను లేదు. వారిలో రాష్ట్రీయతయు నశించినది. వారు క్రైస్తవదేశ క్షేమమును గోరుదురే కాని భారతక్షేమము వారి హృద యములందు మచ్చునకైనను గానము. ఇంతకంటె అనర్థమేమి కావ లయును? ఎంతమంది మాలమాదిగలు పరమతమును స్వీకరించినను హిందూమతమునకు కలుగు నష్ట మేమందురు బ్రాహ్మణులు. కోట్లకొలది సంవత్సరములనుండి హిందూమతము నశించినదా? ఇప్పుడు మాత్ర

మేల నశించునని ధీమాగా పలుకుచుందురు. కొలదిమంది బ్రాహ్మణులు వేదములు చదువుకొని ఇతరులు చదువుకొనకున్నను హిందూమతమును రక్షింతుమని భావించుచున్నారు. అందువలననే అంటరానితనమువంటి దురాచారమును, అమానుషాచారమును ఆచార్యులు పూజాపురస్కార ముల ద్వారమున ఇంకను రక్షింపజూచుచున్నారు. కామకోటి పీఠాధిపతులు చాల గొప్పవారట. వారు ఎన్నియో ఘనకార్యములను నిర్వహించుచున్నా రట. వేదపరిషత్తులు, ఇంకను ఏవేవో పెట్టి వేలకువేలు ధనము బ్రాహ్మ ణులకు వేదాధ్యయన సంపన్నులకు నిచ్చి వారి నుద్ధరించుచున్నారట. దానితోనే హిందువులెల్ల రుద్ధరింపబడుదురట. బ్రాహ్మణుల నుద్ధరించు టకు రాత్రింబవళ్ళు పాటుపడు పీఠాధిపతులు అంటరానివారి దుస్థితి నేల విచారింతురు? అంటరానివారికి పీఠాధిపతులు దర్శనము కూడ నీయక స్వయముగా వారికి దూరులై అంటరానివారై తమ్ముతాము కాపాడుకొనుటలోనే తత్పరులైయుందురు. అంటరానివారు తమ్మును, తాము పూజించుదేవతలను చూచిన తాము తమదేవతలు మైలబడుదు మని తలంతురు. కాని పీఠాధిపతు లెంతో పవిత్రులై నందున వారిని జూచినవారు పవిత్రులు కావలసియుండ, దానికి విపరీతముగా పవిత్రులే అపవిత్రుల దర్శనమున మైలబడుదురుట. వారి పవిత్రత యెంతదుర్బల మైనదో దీనినిబట్టి తెలియుచున్నది. వారి నేమనగలము? వారుచెప్పినది వేదము; వారాచరించినది ధర్మము.

బ్రాహ్మణులు బ్రాహ్మణగురువులు నిట్టి యాచారములను పాటించు చున్నంతవఱకు నీదేశమున హిందువులలో అంటరానితనము దూరము కాదు. హిందువులకు వారే నాయకులు, మార్గదర్శకులును, శ్రేష్ఠజన్ములు మిక్కిలి బుద్ధిమంతులు, విద్యావంతులు. కావున మిగిలిన హిందువులు వారినే అనుసరింతురు.

హిందువులలోని అంటరానితనము పోవలయుననిన బ్రాహ్మణులమని చెప్పుకొనువారు కాక మిగిలినహిందువులెల్లరు నేకము కావలయును. వారి లోగల హెచ్చుతగ్గు భావములను ముందు పోనాడవలయును. బ్రాహ్మ ణులనువారితో సహాయనిరాకరణము ప్రారంభింపవలయును. బ్రాహ్మణ నామధారులకు సంఘములో ప్రస్తుతమున్న గౌరవమర్యాదల నన్నింటిని

త్రోసివుచ్చవలయును. వారిని సభలలో గౌరవించుట మానవలయును. వారిని తాకిన ఇతరులు మైలబడిన స్నానాదుల నాచరింపవల యును. వారి పౌరోహిత్యము నంగీకరింపరాదు. వారి ఆశీర్వాదముల నాసింపరాదు. వారు చూచుచుండగా తామేదియు తినరాదు. దృష్టి స్పర్శదోషములను కేవల బ్రాహ్మణ నామధారుల యెడ పాటింప నారం భింపవలయును. ఇట్లు చేయకున్న హిందువులలో నున్న అంటరానితనము రూపుమాయనేరదు. సంఘశ్రేయస్సుకు, దేశశ్రేయస్సుకు వేరుపురువులుగ నున్న ఈ స్వార్థపరులకు "భవతీ భిక్షాం దేహి" అనుటయే శరణ్యమని ఋజువు చేయవలయును. దీనికిదియే మందు.

ఓమ్ తత్ సత్

ఓమ్

# శ్రీరామనవమి - సీతాకల్యాణము

శ్రీరామనవమి తేపో మాపో రానున్నది. చైత్ర శుద్ధ నవమికి శ్రీరామనవమి యని ప్రసిద్ధి. భారతీయుల కిది యొక పర్వదినము. ఇదియే కాదు. ఇట్టి తిథులు ఇంకను కొన్ని కలవు. గోకులాష్టమి, శివ రాత్రి, వినాయక చతుర్థి మున్నగునవి. ఇవి యన్నియు భారతీయులకు పర్వదినములే. కాని రామనవమి ప్రసిద్ధ పర్వదినము. గ్రామవీధులలో, నగరపు బాజారులలో చిన్నవి పెద్దవి పందిళ్ళు ఎన్నో రామనవమికి వెలయును. ఈ పందిళ్ళ నీడలలో రాత్రింబవళ్ళు హరికథలు బుఱ్ఱకథలు, నాటికలు వినుచు, చూచుచు, జనులుగుంపులు కూడి ఆనందింతురు. ధనికుల పందిళ్ళలో భరతనాట్యము కూడ చూచి యానందించు అవ కాశము జనులకు సులభసాధ్యమే. నవమినాడు మధ్యాహ్న సమయమున పందిళ్ళ క్రింద సీతాకళ్యాణ మహోత్సవములు కూడ జరిపి భక్తులు కృతా ర్థులయినట్లు భావింతురు. ఇయ్యది ప్రతి సంవత్సరము సామాన్యము. ముఖ్యముగా సీతాకళ్యాణ మొనర్చుట ఆంధ్రుల కొక ప్రత్యేకత యనక తప్పదు. ఇతర ప్రాంతములందు విశేషించి ఉత్తరదేశ ప్రాంతములం దెక్కడను సీతాకళ్యాణమొనర్చి జనులు సంతసించుట చూడజాలము.

చైత్ర శుద్ధ నవమినాడు కౌసల్యా గర్భమున శ్రీరామచంద్రు డుద్భ వించినట్లు రామాయణాది ప్రసిద్ధ గ్రంథములు చెప్పుచున్నవి.

"తతశ్చ ద్వాదశే మాసే చైత్రే నావమికే తిథౌ
నక్షత్రేఽదితి దైవత్యే.........................
..................................................
కౌసల్యాఽజనయద్ రామం దివ్యలక్షణ సంయుతమ్"(రా.బా.కాం.స.12-10)

రామాయణములోని యీ శ్లోకములు రామచంద్రుడు చైత్ర శుద్ధ

నవమినాడు - పునర్వసు నక్షత్రమున కౌసల్యకు జనించినట్లు స్పష్టము చేయుచున్నవి. కౌసల్యాదశరథులకు నోముల పంటగా బుట్టిన రాముడు ఉత్తమ జీవనము గడపి లోకమున పురుషోత్తము డనిపించు కొనెను. అందువలన భారతీయులా మహాపురుషుని జన్మదినము పర్వదినముగా భావించి వేడుకలు జరుపుకొనుట వింతకాదు; సహజముకూడ, మహాపు రుషులను పూజింపని జాతి, అదరింపని సంఘము, అనుకరింపని మాన వులు గణుతి కెక్కజాలరుకదా! భారతజాతికి ప్రపంచమున శాశ్వతకీర్తి గడింపజేసిన మహాపురుషులు శ్రీరామచంద్రాదులు గాక మఱియెవరు?

కాని కాలము గడచినకొలది భారతదేశమునందు మహాపురుషులను పూజించు విధానము వికృతమై నిందనీయ పద్ధతుల ననుసరించు చున్నదని వ్రాయవలసి వచ్చినందులకు చింతిల్లుచున్నాడ. చైత్రశుద్ధ నవమినాడు ఆంధ్రప్రాంతమున జరుగు రామజన్మదినోత్సవాలు జన్మదినోత్సవాలుకాక, సీతారాముల కల్యాణ దినోత్సవాలుగా మాఱుట శోచనీయమనక మఱి యేమనవలయునో తోచకున్నది. ఈ స్థితికి దిగజారుటకు గల కారణ ములను గూర్చి వివరించుటయే నాయీపంక్తుల ముఖ్యోద్దేశ్యము.

శ్రీరామచంద్రుడు నేడు మహాపురుషుడు కాడు. అతడు నేటి భార తీయులలో నూటికి తొంబదిమందికి దేవుడైనాడు. మిగిలిన వారికి దేవుని అవతారమైనాడు. కావుననే యితని జన్మదినోత్సవము కళ్యా ణోత్సవముగా మాఱినది. రాముని జన్మదినోత్సవ నెపమున నతని గుణగణములను స్మరించి, యతని యుత్తమ ప్రవర్తనను గుర్తించి, భార తీయులు తమ నడవడికను దిద్దుకొనుటకు బదులు సీతారాముల వర్ణ చిత్రములకో లేక విగ్రహములకో వివాహలీల లొనర్చి తమ జీవనము చరితార్థమైన ట్లెంచుచున్నారు. ఇయ్యది పండితులకు సహింపరాని విషయము కాదా! "వర్ణానాం బ్రాహ్మణో గురుః" అని గురుత్వము వహించిన నేటి బ్రాహ్మణ నామధారు లెందఱో పురోహితులై సీతారా ముల కల్యాణ మహోత్సవములను జరిపించి, అవివేకులనుండి ధనార్జన మొనరించి పామరులను పాపములకు గుఱిచేయుట చూచుచు విద్వాం సులు నోరుమూసికొని మిన్న కుండవలసినదేనా? సత్యము మఱుగునపడి యధర్మము ప్రబలుచుండ యశక్తులవలె కాలము నయింపవలసినదేనా?

ఈ యవతార వాదము నాధారముగ తీసికొని యెందఱో సాధారణ మానవులు వేషధారులై గారడీ విద్యలను నేర్చి వానిమూలమున తాము కూడ నవీనావతార పురుషులమని చెప్పుకొనుచు పామరులను వంచిం చుట నిరాతంకముగా నీ దేశమున ప్రచారములో నుండవలసినదేనా? విజ్ఞు లీ యాచారముల నరికట్టరా? లోకమునకు పరమార్థము బోధింపయత్నింపరా? వసిష్ఠ వామదేవాది మహర్షులకు, రామకృష్ణాది మహాపురుషులకు, శంకర రామానుజాది మహాపండితులకు జన్మభూమి యగు నీ భారతము అనాచారముల కాలవాలము కావలసినదేనా? ఈ యనాచారములకు అంతము లేదా? ఇయ్యవి మహాపురుషుల నామ ములతో నేల వర్ధిల్లవలయును? వారి నామముల నేల కళంకితము చేయవలయును? విజ్ఞు లాలోచింతురుగాక!

శ్రీరాముడు దేవుడా? ఎట్లగును? రాముడు దశరథాత్మజుడని యెఱిగియు జనులతనిని దేవుడని యేల నమ్ముచున్నారు? ఇందులకు కారణము జనులకు దేవు డననేమో తెలియక పోవుటయే, దేవుని స్వరూపమును జనులు విస్మరించుటయే మఱియొం డేమియు కాదు.

వేదముల ప్రచార మీ దేశమున నున్నంతకాలము దేవుడన సృష్టి స్థితి లయములకు కర్త, ధర్త, సంహర్త యని యెల్ల రెఱిగియుండెడి వారు. దేవుడు బ్రహ్మ విష్ణు మహేశ్వరాది బహునామములచే కీర్తింపబడు వాడనియు అత డొక్కడే యనియు, అతడొక వ్యాపకతత్త్వ మనియు, దానికి జన్మ జరామరణము లుండవనియు, అయ్యది సచ్చిదానంద మనియు, నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావము కలదనియు, ఆదిమ ధ్యాంతములు లేనిదనియు, సర్వగతము, సర్వజ్ఞము, సర్వాంతర్యామి, అనుపమము, జ్ఞేయము, ఉపాస్యము ననియు నెల్లరు నెంచెడివారు. ముఖ్యముగా దేవుడు నిరాకారుడనియు, అత డెన్నడు శరీరధారి కాడ నియు, ఈక్షణమాత్రమున జగజ్జన్మాదుల నొనర్పగలడనియు గుర్తించెడి వారు. వేదములు, ఉపనిషత్తులు, ఇతర శాస్త్రములు నన్నియు దేవుని నట్లే వర్ణించుట నేటికిని జూడనగును.

"ఈశావాస్య మిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్
తేన త్యక్తేన భుంజీథాః మా గృధః కస్య స్విద్ధనమ్" (యజు.)

ఈ జగత్తును రచించిన వాడు ఈశ్వరుడు. అతడిందంతటను వ్యాపించి యున్నాడు. అతనిని గుర్తించిన మానవులు అన్యాయార్జన చేయరు. "స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరగ్ం శుద్ధ మపాపవిద్ధం కవి ర్మనీషీ పరిభూః స్వయంభూర్ యాథా తథ్యతో ర్థాన్ వ్యదధాత్ శాశ్వతీభ్యః సమాభ్యః" (యజుర్వేదము)

ఆ పరమేశ్వరు డంతట నిండియున్నాడు. అతడు శక్తిమంతుడు. అతనికి దేహాదులుండవు. పాపము లంటవు. అతడు సర్వజ్ఞుడు. స్వయంభువుడు, జీవులకు భోగమును కలిగింప పదార్థములను రచించువాడు.

"ఏకం స ద్విప్రా బహుధా వదన్తి" (ఋక్)

పరమేశ్వరు డొక్కడు, విద్వాంసు లతనిని అనేకనామములతో చెప్పుదురు.

"యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి
యత్ప్రయం త్యభిసంవిశంతి తత్ విజిజ్ఞాసస్వ తద్ బ్రహ్మ"(తైత్తిరీయము)

పరమేశ్వరుడు సృష్టి స్థితిలయములకు కర్త. అతనినే బ్రహ్మగా తెలిసికొనుము.

"అపాణి పాదో జవనో గ్రహీతా
పశ్య త్యచక్షుః స శృణో త్యకర్ణః
స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా
తమాహు రగ్ర్యం పురుషం మహాంతమ్" (శ్వేతాశ్వతరము)

పరమేశ్వరునకు పాణి పాదములు లేవు. గ్రహణధారణ శక్తి కలదు. కన్నులు, చెవులు లేవు. కాని చూడను, వినను శక్తి కలిగినవాడు. అతని కంతయు తెలియును. అతనిని సంపూర్ణముగా నెవ్వరు తెలియజాలరు. అతడే పరమేశ్వరుడు.

"జన్మా ద్యస్య యతః" (బ్రహ్మ సూత్రములు)

ఈ యింద్రియ గమ్యమగు జగత్తునకు సృష్టి స్థితి లయములు దేని వలన కలుగునో, అదియే బ్రహ్మము.

"క్లేశ కర్మ విపాకాశయై రపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః" యో.ద.

అవిద్యాది క్లేశములతోను, శుభాశుభ కర్మలతోను, ఆ కర్మలవలన జనించు ధర్మాధర్మ సంస్కారములతోను ఎన్నడు నెట్టి సంబంధము లేని వాడు ఈశ్వరుడు.

"ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపల నుండు లీనమై
యెవ్వనియందు డిందు పరమేశ్వరు డెవ్వడు..........
.................................................(భాగవతము)"

పైన జూపిన ప్రమాణములను బట్టి పరమేశ్వరుడు సృష్టి స్థితి లయములకు కర్తయనియు, అతడొక్కడే యనియు నిరాకారుడనియు అనేక నామములచే వ్యవహరింపబడువాడనియు స్పష్టమగుచున్నది.

దేవు డిట్టి లక్షణములు కలవాడని నేడును పామరులు కూడ నంగీకరింతురు. కాని యిట్టి, దేవుని విస్మరించి జన్మజరా మరణాది దుఃఖములకు లోనయిన రామచంద్రాదులను దేవుళ్ళని యేల యంగీకరించుచున్నారు? శ్రీరామచంద్రుడు సృష్టి స్థితి లయములకు కర్త యగునా? కాదని యెల్లరంగీకరింతురు. అటులయిన దేవు డందురేల? అనిన సమాధానము చెప్పజాలక ఆకసము వంక జూతురు. సమాధానమేమి చెప్పగలరు? రామచంద్రునకు పూర్వమే సృష్టి యున్నదని యెవ్వరెఱుగరు? అతడీ సృష్టిని పోషించువాడు కాడనియు, దీనిని లయముచేయజాలడనియు నెల్ల రెఱుగుదురు. కావున నతడు దేవుడు కాడని యెఱుగని వారెవరుందురు?

ఇట్లు ప్రశ్నించిన మీదట కొందఱు సమాధానము చెప్పజాలక రాముడు దేవుడుకాదని యంగీకరింతురు. కాని, అతడు దేవుని యవతార మందురు. పాపము జనులకు అవతారమన నేమో తెలియదు. దేవుడవతరించుననుటలో నభిప్రాయమేమో వా రెఱుగరు. ఈ యవతారవాద మీదేశమున నెట్లవతరించినదో, ఎన్న డవతరించినదో సరిగా నిర్ణయింపజాలము. ఈ వాదము వాస్తవిక పరమాత్మ తత్త్వమును పూర్తిగ విస్మరింపజేసినది. నే డీ వాదము భారతీయులలోనే కాక క్రైస్తవాది మతాంతరముల ననుసరించు వారిలోను మిక్కిలిగ వ్యాపించినది.

క్రైస్తవులు క్రీస్తునకు దేవుని స్థాన మొసంగి యతనినే పూజించుట నెవ్వ రెఱుగరు?

'లాఇలాహి ఇల్లిల్లాహ్' అను ఖురాన్ వాక్యాముతో 'మహమ్మదుర్ రసూలల్లాహ్' అను వాక్యమును జేర్చుటలో నర్థమేమి?

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్ భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహమ్"
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే"

అను భగవద్గీతా శ్లోకములు రెండు భారతీయులలో అవతారవాదమును వ్యాపింపజేసినట్లు బోధపడుచున్నది. అవతారవాదు లెల్లరు తమ వాదమును బలపఱచుట కీ శ్లోకములు నేకరువు పెట్టుచుందురు. వాస్తవమున నీ శ్లోకములు అవతారవాదము నెట్లు ప్రతిపాదించునో బోధపడకున్నది. కారణమేమన, పైశ్లోకములను - వాని యర్థమును గమనించిన వారికి అవతారవాదమున కిందు ప్రసక్తి కనిపింపదు. ఆ శ్లోకములలో అవతారవాదపదమే కనిపింపకుండు టొకటి. రెండవది కృష్ణుడు దుష్టులను శిక్షించుటకును, శిష్టులను రక్షించుటకును, అధర్మము నణచి ధర్మము నుద్ధరించుటకును తానప్పుడప్పుడు పుట్టెదననుచున్నాడు. ఇందు దేవుడవతరించుననుటకు ప్రసక్తియే కనిపింపదు. ఈ శ్లోకార్థములు అవతారవాదమును బోధింపవలయు ననిన ముందుగా కృష్ణుడే దేవుడని యంగీకరింప వలసి వచ్చును. అది యెట్లు పొసగును? పూర్వము చెప్పిన దేవుని లక్షణములు కృష్ణునియందెట నున్నవి? అతడు సృష్టి స్థితి లయములకు కర్తయా? కాదుగదా! అట్టియెడ నతడు దేవు డెట్లగును? కానినాడు అతడు తాను దుష్టశిక్షణ శిష్టరక్షణ కొఱకు యుగయుగమున పుట్టెదననుట అవతార వాదము నెట్లు బోధించును? విజ్ఞులాలోచింపుడు!

అవతార పదమున కర్థమేమి? నిరాకారస్వభావము గల పరమాత్మ తత్త్వము శరీరధారణ మొనర్చుట యనియా? లేక మఱి యొండేమైన నున్నదా? ధాత్వర్థమును బట్టి అవతారమనగా దిగుట యనియర్థము. శరీరధారణముకాని జన్మించుట కాని అవతారపదమున కర్థము కాదు. కావుననే కాబోలు అవతారవాదులు పరమేశ్వరుడు జన్మించినాడని కాని,

శరీరధారణము చేసినాడని కాని యనరు. అవతరించినా డందురు. అని నవేమి? పరమేశ్వరు డెక్కడ నున్నాడు? ఎక్కడికి దిగినాడు? పరమే శ్వరుడు అంతట నుండు నందురేని అతడెట్లు దిగగలడు? ఒకచో నెత్తు ప్రదేశమున నుండి, క్రింది ప్రదేశమున లేనివాడు దిగుట సంభవించును. పరమేశ్వరు డ ట్లొకచో నుండి మఱియొకచో లేనివాడు కాడుగదా! అత డవతరించు టెట్లు పొసగును?

అవతారవాదు లెక్కువగా విష్ణువు నవతరింపజేయుదురు. అందువ లననే కాబోలు అతని నెక్కడనో "అలవైకుంఠపురము నందు" నెలవు వేర్పఱచి యట నుంచియున్నారు. దిగివచ్చునపు డచటి నుండియే వచ్చు చున్నట్లు 'సిరికిం జెప్పడు.....' అని వర్ణించుట చూతుము. ఈ వర్ణనలు ప్రమాణ సహములేనా? గజేంద్రుని రక్షింప వైకుంఠవా సుడు స్వశరీరముతోనే దిగివచ్చినాడు కదా! అతడే రావణుని సంహరింప కౌసల్యా గర్భమున ప్రవేశించి కష్టపరంపరలకు గుఱియైనాడేల? పై విధములగు నవతారములలో నేది సరియైన యవతారము? వైకుం ఠము నుండి తిన్నగా దిగి వచ్చుటయా? కొండొక స్త్రీ గర్భమున జేరి మురికి కూపమున వసించి, జనన కాల యాతనల ననుభవించి, పుట్టిన తదుపరి బాల్య యౌవనాద్యవస్థలకు లోబడి సాంసారిక జీవులవలె నానావిధ సుఖదుఃఖాదుల ననుభవించి జీవితయాత్ర నిర్వహించి నిందా స్తుతులకు లోనగుటయా? ఏది యవతారపద వాచ్యము? అవతారవాదు లేమందురు?

ఈశ్వరుడు జన్మమరణములకు లోనుగాడు. జన్మము స్థూలదేహ ముతో సంబద్ధుడగుట. మరణము స్థూలదేహమును విడిచిసూక్ష్మదేహ ములో నన్యయోనికి - లోకమున జనుట. ఈ యవస్థలు జీవునకుండును. కాని ఈశ్వరున కుండవు. ఈశ్వరుడు శుభాశుభకర్మముల నొనర్పడు. కావున నతని కా కర్మ ఫలముల ననుభవించుటకు శరీరధారి కావలసిన స్థితియునేర్పడదు. కావుననే పతంజలి మహర్షి యోగదర్శనమున ఈశ్వ రుడు "క్లేశ కర్మ విపాకాశయై రపరామృష్టః పురుష విశేష ఈశ్వరః" - 'అవిద్యాది క్లేశములతోను, శుభాశుభకర్మలతోను, విపాకాశయముల తోను ఎన్నడు సంబద్ధుడు కాడు, అని నిర్వచించియున్నాడు. కావున

నీశ్వరుడు శరీరధారణ మొనర్చి యవతరించు ననుట శాస్త్ర విరుద్ధము; యుక్తివిరుద్ధము. ఈశ్వరుడు సర్వవ్యాపకు డగుటచే నతడు వైకుంఠాది లోకములనుండి, అన్యలోకముల నుండు దుష్టులను శిక్షించుటకో, శిష్టులను రక్షించుటకో కదలి వచ్చు ననుటయు నసంభవము.

రామాయణవర్ణనలను బట్టి చూచినను రాముడు ఈశ్వరుడు (దేవుడు) కాడనియు, నతడొక యుత్తమ మానవుడనియు స్పష్టమగుచున్నది. చూడుడు.

తపస్వియైన వాల్మీకి తన యాశ్రమమునకు వచ్చిన మునిపుంగవుడైన నారదు నిట్లు ప్రశ్నించినాడు. "ఈ లోకమున నిప్పుడు గుణవంతుడు. వీర్యవంతుడు, ధర్మజ్ఞుడు, కృతజ్ఞుడు, సత్యవాక్యుడు, దృఢవ్రతుడు, చరిత్రయుక్తుడు, సర్వభూతహితుడు, విద్వాంసుడు, సమర్థుడు, ప్రియదర్శనుడు, ఆత్మవంతుడు, జితక్రోధుడు, ద్యుతిమంతుడు, అసూయలేనివాడు, యుద్ధరంగమున దేవతలనుగూడ భయపెట్టగల కోపము గలవాడు, నైన నరు డెవడైన నున్నాడా? ఇట్టివాని నెఱుగగల సమర్థుడవు గావున ఓ నారదమునీ! నాకు చెప్పవలసినది!

నారదుని సమాధానము:- ఓ వాల్మీకి! నీ వడిగిన గుణములతో గూడిన నరుని గూర్చి చెప్పెద వినుము.

"ఇక్ష్వాకువంశ ప్రభువు రాముడని జనులలో ప్రసిద్ధి పొందినవాడు ఒక నరు డున్నాడు. అతడునియతాత్ముడు, మహావీర్యుడు, శ్రుతిమంతుడు, ధృతిమంతుడు, వశి, బుద్ధిమంతుడు, నీతిమంతుడు, వాగ్మి, శ్రీమంతుడు, శత్రునిబర్హణుడు.........."

వాల్మీకి రామాయణమున బాలకాండమునందలి మొదటి సర్గలో 1-20 శ్లోకములందలి వాల్మీకినారద సంభాషణమును జదివినపుడు పై ప్రశ్నోత్తరములు లభించును. ఇట రాముడు నరుడుగా వర్ణింపబడినాడు. దేవుని అవతారముగ కాదు. ఈ మొదటి సర్గలో రాముని చరితమంతయు సంక్షిప్తముగ జెప్పబడినది. ఈ నూఱు శ్లోకములలో నవతారప్రసక్తియే కనిపింపదు. ఇట్లే వాల్మీకిరామాయణమునందు రాముడు మానవుడేకాని దేవుడు కాదని స్పష్టపఱచుట కెన్నో ప్రమాణములు చూడవచ్చును.

రాముడు పూర్వజన్మమున జేసిన కర్మములకు ఫలముగా నీజన్మ మున దుఃఖముల ననుభవించుచున్నట్లు ఈ క్రింది శ్లోకముల వలన తెలియుచున్నది.

లక్ష్మణుడు రామవనవాసము నంగీకరింపక క్రుద్ధుడై తండ్రియైన దశరథుని కూడ చంపి రాముని రాజ్యాభిషక్తుని చేయ సిద్ధమగును.

"హనిష్యే పితరం వృద్ధం కైకేయ్యాసక్తమానసమ్
కృపణం చ స్థితం బాల్యే వృద్ధభావేన గర్హితమ్"

(రా.అ.కాం.21-19)

'కైకేయియందు ఆసక్తమనస్కుడైన ముసలి తండ్రిని చంపి రాముని రాజ్యాభిషిక్తుని చేయుదును'. నన్ను అడ్డువారెవరు లేరు. చూడు తల్లీ! యని కౌసల్యతో లక్ష్మణుడు పలుకుచుండ రాము డతని సమీపించి యిట్లుద్బోధించును.

"కృతాంత ఏవ సౌమిత్రే! ద్రష్టవ్యో మత్ప్రవాసనే
రాజ్యస్య చ వితీర్ణస్య పునరేవ నివర్తనే" (అ.22-15)

'లక్ష్మణా, నా ప్రవాసమునకు కారణము కృతాంతుడే దైవమే, కాని యన్యము కాదు'.

"కశ్చ దైవేన సౌమిత్రే యోద్ధు ముత్సహతే పుమాన్
యస్యానుగ్రహణం కించిత్ కర్మణోఽన్యన్న దృశ్యతే" 21

"సుఖదుఃఖే భయక్రోధే లాభాలాభౌ భయాభయౌ
యస్య కించి త్తథా భూతం నను దైవస్య కర్మ తత్" 22

"అసంకల్పిత మేవేహ యదకస్మాత్ ప్రవర్తతే
నివర్త్యారబ్ధ మారంభైర్ నను దైవస్య కర్మ తత్" 24 (అ.కాం.22స)

"లక్ష్మణా! దైవముతో నెవరు పోరాడ నేర్తురు? అయ్యది కర్మఫలముకాక మఱియొండు కాదుగదా!

సుఖదుఃఖములు, భయక్రోధములు, లాభాలాభములు నన్నియు దైవకృతములు. కర్మఫలము కాక మఱి యొండేమగును?

ప్రారంభించిన పనులను సఫలము కానీయక, సంకల్పింపనిది మఱి యొకటి జరుపుట దైవకర్మ యగును. మఱియొండు కాదు."

అను నీ వచనములతో రాముడు తనకు కలిగిన వనవాసమున నకు కారణము తాను పూర్వ మొనర్చిన కర్మలకు ఫలముగా జెప్పి యావిషయమున కైకేయీ దశరథులను నిందించి ప్రయోజనము లేద నుచున్నాడు. దీనింబట్టి రాముడు అనేక జన్మముల నెత్తి, యందు సుకృత దుష్కృతముల నొనర్చినట్లును, ఆ దుష్కృత కర్మలకు ఫల ముగా నిప్పుడు వనవాసరూప దుఃఖము ననుభవింపవలసినవా డైనట్లును తెలియుచున్నది. కావున రాముడు దేవుడు కాదు. దుష్టశిక్షణార్థము శరీరధారణ మొనర్చిన దేవుని అవతారమును కాదని స్పష్టమగుచున్నది కదా!

మఱియు నింకొకయెడ తాను పూర్వజన్మమున నెన్నో పాపకృత్య ముల నొనర్చినట్లు ఎంత స్పష్టముగా చెప్పుచున్నాడో చూడుడు:

న మద్విధో దుష్కృతకర్మకారీ, మన్యేద్వితీయోస్తి వసుంధరాయామ్;
శోకానుశోకో హి పరంపరా యా, మామేతి భిందన్ హృదయం మనశ్చ"
"పూర్వం మయా నూన మభీప్సితాని పాపాని కర్మా ణ్యసకృత్ కృతాని
తత్రాయ మద్యాపతితో విపాకో దుఃఖేన దుఃఖం యదహం విశామి"

(అరణ్యకాండము 63 స.3-4-శ్లో)

'లక్ష్మణా! ఈ భూమియందు దుష్కర్మల నొనరించిన వాడు నా వంటి వా డింకొక డుండడు. లేకున్న నా హృదయమును, మనస్సును భేదించుచు నీ శోకపరంపర నన్నేల చేరును!'

'నేను పూర్వజన్మమున నిశ్చితముగ కావలయునని యనేక దుష్కర్మ లను చేసియున్నాను. ఆ పాపములే పరిపక్వమైనన్నిట్లు దుఃఖపరంపరలో ముంచుచున్నవి' అని.

రాముడు తాను పూర్వ మొనర్చిన పాపముల ననుభవించుచున్నట్లు చెప్పుచు నిట విపాకపదమును ప్రయోగించి యున్నాడు. ఇయ్యది రాముని జీవత్వమును ఋజువు చేయును. కాని దేవత్వమును కాదు. అట్టియెడ దుష్టశిక్షణార్థము దేవుడు రాముడుగా నవతరించినా డనుట

యెట్లు శాస్త్రీయమగును?

రావణాది దుష్టులను సంహరింప దేవుడు దశరథపుత్రుడుగా నవతరించినట్లు అవతారవాదు లంగీకరింతురు. దశరథరాముడుగా నవతరించుటకు పూర్వమే పరశురాముడుగా నవతరించియున్న దేవుడు రావణునేల వధింపడయ్యె? పరశురాముని దృష్టిలో రావణుడు దుష్టుడు కాదా? కారణమేమి? బ్రాహ్మణు డగుట వలననా? ఈ ప్రశ్నలకు అవతారవాదులు సమాధానము లేమి చెప్పుదురు?

ఆదిశంకరాచార్యులు "కరణవ చ్చే న్న, భోగాదిభ్యః" (బ్ర.సూ.2-2-40) అను వేదాంత సూత్రమునకు భాష్యము వ్రాయుచు

"అథ లోక దర్శనానుసారేణ ఈశ్వర స్యాపి కించిత్ కరణానా మాయతనం కామేన కల్ప్యేత! ఏవమపి నోపపద్యతే, సశరీరత్వే హి సతి సంసారివద్ భోగాది ప్రసంగాత్. ఈశ్వరస్యాప్యనీశ్వరత్వం ప్రసజ్యేత"

లోకమున జూచునట్లు ఈశ్వరునకు శరీరము కల్పింతుమేని సంసారివలె నతనికికూడ భోగప్రసక్తి కల్గును. సుఖదుఃఖముల ననుభవింపవలసినవా డగును, అని అభిప్రాయము. అనుభవించిన దోషమేమి? అందుమేని అప్పు డతడీశ్వరుడు కాజాలడు. సుఖదుఃఖములకు లోనగువాడు ఈశ్వరుడు కాజాలడని ఆచార్యుల యభిప్రాయము.

ఆచార్యులు వ్రాసిన యీ వచనములను బట్టి ఈశ్వరుడెన్నడు శరీరధారి కాజాలడనియు, శరీరధారి ఈశ్వరుడు కాడనియు స్పష్టమగుచున్నది. కాబట్టి శ్రీరాముడు శరీరధారి కావున నత డీశ్వరుడు కాడు. ఈశ్వరావతారమును కాజాలడని స్పష్ట మగుచున్నది.

దేవుడు దుష్టులను శిక్షించుటకుగాని, శిష్టులను రక్షించుటకుగాని శరీరధారణము చేయవలసిన యావశ్యక మేమున్నది? శరీరధారణ చేయక జీవులొనర్చు పుణ్య పాపములకు ఫలము లొసంగజాలడా? జన్మించిన రావణాదులు చావక యేమగుదురు? ఎల్లకాల మట్లే యుందురా? "జాతస్య హి ధ్రువో మృత్యుః" - 'పుట్టినవాడు చావక తప్ప' దను

నిత్య నియమ మేమగును? పుట్టినవానికి చావు తప్పదను నియమ ముండగామధ్యలోదేవుడవతరించి యొకనిని చంపనేల? ఇతరులు ప్రారబ్ధ కర్మఫల భోగానంతరము మరణించునట్లు రావణాదులు మరణింపరా? వారిని చంపుటకు దేవు డవతరింపనేల? ఇట్లు విచారించి చూడ అవ తారవాదమున కర్థమొండును కనిపింపదు. కావున శ్రీరామచంద్రుడు దేవుడు కాని, దేవుని అవతారముకాని యెన్నడు కాజాలడు. అందువలన నతడు మానవులలో నుత్తమ మానవు డన నొప్పును. రామాయణ మతని చరిత్రను బోధించును. దానింబట్టి రాముడుత్తమ చరితు డనుట కెట్టి సంశయము నుండదు. రాముని సుగణ సంపద, అతని ప్రవర్తన విశిష్టము లనక తప్పదు. అట్టివారి నవతార పురుషులని చెప్పుకొనుట యెవరికేని ఇష్టమగు నెడల నది కాదనము. కాని ప్రత్యేకముగా దేవుని యవతార మనుట సంగతము కా దందుము.

కొందఱు దేవుని యంశము రామాదులలో నధికముగా నుండు నందురు. అదియును సముచితము కాదు. దేవుడంతట నందఱిలోను సమముగా వ్యాపించి యుండును. ఒకచో నెక్కుడుగా నుండు ననుట యుక్తము కాదు.

రామాదుల జన్మదినోత్సవములు జరుపుట దోషము కాదు. వారి వర్ధంతులు జరుపుట అనుచితము కాదు. కాని జన్మదినమున సీతారా ములకు వివాహాదులు నొనర్చుటలోగల యౌచిత్యమేమి? సీతారాములు జీవకోటికి చేరినవారు. వారు జన్మించి దివ్యజీవనమును నడుప యత్నించి, యథాశక్తి సాఫల్యమును సంపాదించి తరించి యుందురు. వారి జీవన ములు సాధారణ మానవుల కనుసరణీయములు కావచ్చును. కావలయును కూడ. కాని, వారి జన్మదిన సందర్భమున వారి బొమ్మలకు పెండ్లిక్రియలు రచించుట వారియెడ భక్తిని ప్రదర్శించుట యగునా? సీతారాముల జీవనకాలమున వారికొక పర్యాయమే వివాహము జరిగినది. వారి జీవనానంతరమువారికి ప్రతి సంవత్సరము ననేకు లనేక స్థలములందు వివాహములు జరిపించుటలో నౌచిత్యమేమి? ఇది మహాపురుషులను గౌరవించుటయా? పరిహసించుటయా? వారి వివాహము వారి జననీ జనకులు మహావైభవముగ జరిపియుందురు. మనమిప్పుడు చేయునదేమి? ఏ దేశమునందైన, నిట్టి పనులు చేసి మహాపురుషులను గౌరవించిన

వా రున్నారా? ఇందరి విశిష్టతను ఆంధ్రులే గుర్తించినారా? అటు
లైన గాంధి మున్నగు నేటి మహాపురుషుల జన్మదినములందు వారికి
వివాహాదులను రచింపరేల? చనిపోయిన వారి బొమ్మలకు వివాహా
దులను జరుపుట భక్తి యనబడునా? మనము బొమ్మలకు చేయు
వివాహములు నిత్యములా అనిత్యములా? మన వివాహాదులలో జరుపు
మంత్రములేనా సీతారాముల వివాహమున జరుపునవి? ఆ మంత్రము
లలో నెటనైన సంవత్సరకాలమే యీ వివాహబంధమని చెప్పబడినదా?
సంవత్సరము లోపలనే వారు పరస్పరము విడాకు లిచ్చుకొనుచున్నారా?
లేకున్న మరల మరల వివాహము లేల చేయుదురు?

ఆంధ్రులలో వివాహ సమయమున వరుడు వధువు కంఠమున మంగ
ళసూత్రమును బంధించును. సీతారాముల వివాహమున సీతామతల్లి
మెడలో తాళి నుంచువా డెవడు? మనము చేయు కల్యాణమంటమున
సీతారాములకు బదులు వారి విగ్రహములో బొమ్మలో ఉండునుగదా?
రామవిగ్రహము తాళిబొట్టు నెట్లు సీత మెడలో ఉంచును? అని పురో
హితుడో, లేక యజమానులుగా కూర్చుండి నటించు మానవులోగదా
చేయవలసినవారు. వారిలో నెవరు చేసినను అదియపచారము కాదా?
ఈ యనాచారము లాచరించుటకు ఇంత ధనము వ్యయించి, ఇంతటి
యాడంబరములు చేయనేల? దేవుళ్ళకు, అవతారపురుషులకు పెండ్లిండ్లు,
పవళింపు సేవలు చేయుటయేనా మానవకర్తవ్యము? ఈ పనులు చేసి
ధార్మికుల మనిపించుకొందుమా? అనాచారుల మనిపించు కొందుమా?
ఇయ్యవి ధర్మకార్యములని యే ధర్మశాస్త్రమున నున్నది? కొంచెము
శాంతచిత్తముతో నాలోచింపుడు!

వాస్తవమున రాముడు సీతమ్మ కంఠమున మంగళ సూత్రము
కట్టినట్లు రామాయణమున జూడము. ఉత్తర భారతవాసులలో నేటికిని
భార్యకంఠమున తాళి గట్టు ఆచారములేదు. రాముడు కట్టని తాళి
సీతమ్మ మెడ కర్పించుట సదాచారమా? ఇయ్యది భక్తికి చిహ్నమా?
వివాహాది కృత్యములు భక్తిప్రేరితములా? కామవాంఛా ప్రేరితములా?
ఇయ్యవి భక్తిద్యోతకములా? శృంగార రస వ్యంజకములా? మహాపురు
షుల యెడ భక్తిని ప్రదర్శించుట కింకొక మార్గము లేదా? ధనమును

వ్యయించుట కన్నోపాయము కనబడదా? ఆలోచింపుడు.

రాముడు పుట్టిన తిథికే అతని పెండ్లి అయినదా? సీతాకల్యాణము పునర్వసు నక్షత్రమున కాక ఉత్తరఫల్గునీ నక్షత్రమున జరిగినట్లు రామాయణమున నున్నది.

"మఘాహ్యద్య మహాబాహో తృతీయ దివసే ప్రభో
ఫల్గున్యా ముత్తరే రాజన్ తస్మిన్ వైవాహికం కురు"

(బా.కాం.71-24)

రామాయణమున రామవైవాహిక క్రియ చైత్రమున నవమినాడు పునర్వసు నక్షత్రమునకాక మఱి యెన్నడో జరిగినట్లుండ, జన్మదినమున వివాహము రచించుటలో గల శ్రేష్ఠతయేమో బోధపడకున్నది. పామరులకు తెలియదు సరియే. చదువరులు, బ్రాహ్మణోత్తములైన నిది గుర్తింపరేల?

రామనవమికి సీతారాముల చిత్రపటములతో పందిళ్ళ నలంకరించి రామాయణము పఠించి, పఠింపజేసి, విని, వినిపించి రామచరితము నలవఱచుకొనుటకు దీక్షాబద్ధులైనచో జన్మదినోత్సవ మందముగా నుండదా? అనాచారులు అన్యాయార్జిత విత్తమును వెచ్చించి వివాహ వేడుకలు జరిపి పెద్దల యెడ అపచారము చేయుట యుక్తమా?

ఏమో వ్రాసితినని యెంచక పై విషయములను బాగుగ నాలోచించి మహాపురుషుల జన్మదినోత్సవములు పరిహాసాస్పదములు చేయక వాని యౌచిత్యమును కాపాడుట కనువుగ వర్తించి శుభముల బడయుదురు గాక!

- గోపదేవ్

ఓమ్

# జాతీయత
## NATIONALITY

ప్రస్తుతం భారతదేశములో జాతీయైక్యతను గూర్చి దేశనాయకులు తమ భాషణములలో పలుమారు పలువిధముల ఆలాపించుట వినుచున్నాము. ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి జాతీయైక్యతను సంపాదింపనొక సంఘమును స్థాపించి యున్నట్లును వినుచున్నాము. పత్రికలలో చదువుచున్నాము. ఈ సంఘము పైవిషయమున సాధించు ఫలము నికట భవిష్యత్తున జూడవలసి యున్నది.

జాతి-జన్మ:- జాతి, జన్మ అను నీరెండు పదములు సంస్కృత భాషయందు సమానార్థకములు, జన్మ అనినను జాతి యనినను ఒక్కటే. భేదము లేదు. మనుష్యజాతి, మనుష్యజన్మ అను పదములలో ఆవంతయు భేదములేదు.

లాక్షణికులు జాతిపదమునకు "అనేక వ్యక్తులలో నొక సమాన జ్ఞానమును కలిగించునది జాతి" యని లక్షణము జెప్పి యున్నారు. ఉదాహరణమునకు - మనుష్యజాతిని తీసికొందము. మనుష్యులలో ఒకరి కంటె నింకొకరు అవయవములలో గల హెచ్చుతగ్గులను బట్టి భిన్నులుగా - వేరువేరుగా కనిపింతురు. వెంకన్నకుగల హస్తపాదాదుల కొలతలు (లావు సన్నములు, పొడవు కుఱుచలు) సుబ్బన్న యవయవముల కొలతల కంటె భిన్నములుగా హెచ్చుతగ్గులు కలవిగా నుండుట ఎల్లరెఱిగిన విషయము. వారిదేహములు భిన్నపరిమాణములు కలిగియుండును. పేర్లు భిన్నములు, ఆయుః ప్రమాణములు భిన్నములు. ఇట్లే యితర మనుష్యులందును, అవయవ భేదములను జూతుము. ఈవిధముగ ప్రతి మానవుడు మరియొకని కంటె భిన్నుడని స్పష్టమగుచున్నను మనము వారినందరిని 'మనుష్యులు' అను ఒకే పదముతో వ్యవహరించుచున్నాము. దీనికి కారణ మేమి?

అనేక వ్యక్తులను ఒకచోట జూచినపుడు మనకు ఒక్కొక్క వ్యక్తి విషయమున 'ఇతడు మనుష్యుడే' ఇతడు మనుష్యుడే ఇతడు మనుష్యుడే యను బుద్ధి-జ్ఞానము సమానముగా కలుగుచున్నది. ఇట్టిసమాన బుద్ధిని గలిగించు నట్టి సామాన్యవిషయము ఆవ్యక్తులలో నొకటి యుండి యుండవలయును. కారణమేమన, విషయము - వస్తువులేనిదే జ్ఞానము కలుగదు. జ్ఞానము సవిషయకము కదా! కాబట్టి యా. యనేకులైన మనుష్యవ్యక్తులలో సమానమైన, ఒకే రకమైన, అందరును మనుష్యులే అనుజ్ఞానము కలిగించునట్టి యొకసామాన్య విషయమే మనుష్యత్వము అదియే 'సామాన్యము' లేక 'జాతి' యనబడును. మనుష్యులెల్లరిలో నుండు మనుష్యత్వమే మానవత్వము. మానవత్వమే జాతి నామముతో భాషలో పేర్కొనబడుచున్నది. ఈ లక్షణమును బట్టి ప్రపంచమా నవు లెల్లరు ఒక్కమనుష్యత్వ - మానవత్వ జాతికి చెందినవారనుటలో నెవ్వరికి వ్యతిరేకత యుండరాదు.

ఇక ఒక దేశమునకు జెందిన మానవులెల్లరు ఆ దేశమున పుట్టి పెరిగినవారు ఆ దేశమునకు జెందిన మానవజాతి యని పిలువబడుదురు. అందువలన భారతీయజాతి, ఆంగ్లేయజాతి, లేక యూరపీయజాతి, అమెరికన్ జాతి, చైనాజాతి, జపాన్ జాతి, రష్యన్ జాతి, అనునిట్టి నామ ములతో నాయాదేశవాసులెల్లరు నొక్కొక్కజాతికి జెందినవారుగ గుర్తింప బడుచున్నారు. ఇటజాతియనగా అయాదేశపు మానవుల సముదాయము. దేశపదము జాతిపదమునకు విశేషణముగా వాడబడుచున్నది. దానివలన నామానవ సముదాయ మేదేశమునకు జెందినదో తెలుప తోడ్పడును.

అయాదేశపు మానవులనేక మతములకు అనేక భాషలకు జెందిన వారు కావచ్చును. కానివారెల్లరు నాదేశపు మానవజాతికి చెందిన వార గుటలో సందేహింప బని యుండదు. కావున వారెల్లరు నొకే జాతీయతకు చెందిన వారగుదురు.

ప్రస్తుతమున మనదేశమునకు లోకసభ భారతదేశమను నామ మంగీ కరించి యున్నది. మనయీ భారతదేశమున అరువది కోట్లకు పైగా మానవులు నివసించుచున్నారు. వీరందరు భారతదేశపు మానవులు. ఇందులో పరదేశీయులెవ్వరు లేరు. పూర్వమెప్పుడో యెన్నియో శతా

బ్దముల క్రిందట అరబ్ నుండియో పర్షియా నుండియో యెందరో కొందరు వచ్చిన వారున్నను వారీ దేశవాసులై తామీదేశవాసులమని చెప్పు కొనుచు నెన్నియో శతాబ్దములు గడచిపోయినవి. కావున నిప్పుడు భారతదేశమున నివసించు నరువది కోట్లమానవులు వారేమతమునకు జెందిన వారైనను, ఏభాష మాటలాడు వారైనను భారతీయులమని చెప్పుకొనుటకు వెనుకాడరు. వెనుకాడకూడదు. అందువలన వారి జాతీయత భారత జాతీయత యగుటలో నాటంక మేముండును? ఏమియు నుండదనియే నా యభిప్రాయము.

ఈ దేశపు ముస్లిమ్ సోదరుడు తననుతాను భారతీయుడనని చెప్పు కొనడా? విదేశాలలో ఇంగ్లీషులో 'ఇండియన్' అని చెప్పుకొనుటలేదా? అట్లే భారతీయుడనని చెప్పుకొనుటలో నభ్యంతర మేముండును? క్రైస్త వుడు కాని, బౌద్ధుడుకాని, జైనుడుకాని, హిందువని పిలువబడు వైదికు డుగాని, మరియొకడుకాని తనను 'నేను భారతీయుడను' అని చెప్పుకొన నంగీకరింపని వాడుండడు. దీనివలన జాతీయత ఒకటి సులభముగ సిద్ధించును. ఇందుకు పెద్దగా జాతీయైక్యతను గూర్చి అంగలార్చ వలసిన పనియు కనిపింపదు. ఇట్లు ప్రభుత్వము ఈ దేశవాసులలో ఒకే భారతజాతీయతను సులభముగా నెలకొల్పవీలుండగా నిత్యము దీనికా అకు ఆందోళన పడనేల? కమిటీల నిర్మింపనేల? అర్థము కాకున్నది. రేపురానున్న జనాభా లెక్కలలో నేషనాలిటి - జాతియనుచోట 'భారతీయత' అని యెల్లమతముల వారు వ్రాయవలయునని యాజ్ఞాపించిన జాలదా? ఆయాజ్ఞ నుల్లంఘింప నెవరితరమగును? ప్రభుత్వ మీ దిశలో నేల ఆలోచింపదు? అవగతము కాకున్నది.

అసలు భారత ప్రభుత్వము 'భారతీయత' అనునది జాతిబోధక పదముగ నంగీకరించుచున్నదా? అంగీకరించునెడల భారత దేశమున నుండు వారు భారతీయులు. వారియందుగల జాతిభారతీయత. ఇట్లు భారతీయులుగా నెల్లరు నంగీకరించి వారి జాతి 'భారత జాతీయతగానేల ఘోషణచేయదు? ఇట్లు జాతీయైక్యత సులభ సాధ్యము కాదా? ఇదికాక ప్రభుత్వము కోరునదేది?

ప్రభుత్వ మీ విషయమును విడిచి, దానికి ప్రాధాన్యమీయక మత

కలహములను జాతీయతతో ముడిపెట్టి 'జాతీయైక్యత - నేషనల్ ఇంటి గ్రిటీ' అని యేమేమో చెప్పుచు నిరంతరాందోళనమున కేల గురియగు చున్నదో సామాన్య మానవబుద్ధికి తోచకున్నది.

భారత దేశమున నివసించుచు నిక్కడి యన్న జలవాయువులతో తనను పోషించు కొనుచు నీ దేశమును తన దేశముగ నెంచక "నేను భారతీయుడను కాను" అనువాని నీదేశము నుండి తనదేశమునకు బోవ ప్రభుత్వము వెంటనే తగినయేర్పాట్లు చేయవలయును.

హిందుత్వ, ఇస్లామిత్వ, క్రైస్తవత్వములు జాతులా?

ఇటనొక విషయ మాలోచింపవలసి యున్నది. అదియెద్దియన హిందుత్వ, మహమ్మదీయత్వ, క్రైస్తవత్వ, జైనబౌద్ధత్వాదులు జాతులా? ఇవి 'నేషనాలిటీ' లనబడునా? నేషనాలిటీ ఇంగ్లీషు పదము. దానికర్థము ఆంగ్లభాషావిదులాలోచించి చెప్పవలసినది. దానిని వారికి వదలుదము. ఇక హిందుత్వాదులు మాత్రము జాతులు కావు. లాక్షణికులు చెప్పిన జాతిలక్షణమునకీ పదములు లక్ష్యములు కావు. కాని పలువురుహిందు వులలో అనేకులయిన మహమ్మదీయులలో నట్లే పెక్కుమంది క్రైస్తవు లలో కలుగు హిందు, మహమ్మదీయ, క్రైస్తవాది సామాన్య జ్ఞానములు హిందుత్వాది జాతులేల కావు? అనవచ్చును. కాని, అట్లనుట సరికాదు. కారణమేమన, హిందు, ముస్లిమ్, క్రైస్తవాది నామములచే పేర్కొనబడు వ్యక్తుల నామములు జాతి నెరుగగోరు వారికి ముందుగా తెలిసినపుడే వారిలో నొక విధమగు సామాన్య బుద్ధి - వీరందరు హిందువులు, ముస్లి ములు, అనుబుద్ధి కలుగును. కాని, వారానామములచే పిలువబడు వారని తెలియనపుడు వారెల్లరు 'మనుష్యులే' యను సామాన్యబుద్ధి కలుగును. కావున నా విభిన్న మతస్థులలో గల 'మనుష్యత్వమే' జాతియగును కాని హిందుత్వాదు లెన్నడును కాజాలవు. ఇంతేకాక.

లాక్షణికులు జాతికి మరియొక లక్షణము కూడ జెప్పియున్నారు. అదియెద్దియన:- "ఆకృతిగ్రహణాజాతిః" ఆకారముతో జాతి గ్రహింపదగి నది అనగా జాతిని గ్రహింపచేయునది ఆకారమని యర్థము.

ఈ లక్షణమునుబట్టి చూచినను హిందు ఆది పదములతో చెప్ప

బడునెల్లమతముల వారు తమ మతములకు సంబంధించిన వేషభూషాదులను వదలి యెల్లరు నొకచోట నిలచిన, వారి యాకారములవలన వారెల్లరు మానవులనియే చూచువారికి బోధపడుదురు. కాని, హిందు, ముస్లిమ్, క్రైస్తవులు ఆదిగా నెవ్వరును గుర్తింపబడరు. కాబట్టి హిందుత్వ, మహమ్మదీయత్వాదులు జాతులు కావని స్పష్ట పడుచున్నది. అట్టియెడ హిందుత్వాదులను జాతులుగా పరిగణించి, అభిన్న జాతులలో నైక్యము సాధించు వ్యర్థప్రయత్నము దేశనాయకులు. ప్రభుత్వము నేల చేయుచున్నట్లు?

మతబోధకములగు హిందు ముస్లిమ్ అది పదములను జాతీయత కంటగట్టి, మత కలహములను జాతి కలహములుగా నెంచి వానికిగల కారణములను దొలగింపక మిశ్రమ జాతీయతను జాతి సాంకర్యమును - గనిపెట్ట కమిటీలను నిర్మించి వాని మూలమున క్రొత్త సాహిత్యము నిర్మింపజేసి తన్మూలమున జాతీయైక్యతను సంపాదింపగోరు ప్రభుత్వమును, దేశనాయకులను నేమని ప్రశంసింపవలయునో సామాన్యబుద్ధులకవగతము కాకున్నది.

పై విచారణ ననుసరించి రానున్న జనాభా లెక్కలలో 'జాతి-భారతీయత' మతము - వైదికము. ఇస్లామ్, క్రైస్తవము, బౌద్ధము, జైనము, పారసీకమునని వ్రాయునట్లు ప్రభుత్వమాదేశించిన జాతీయైక్యత సులభముగా నేర్పడును. లెక్కలు వ్రాయువారికీ విషయము ముందుగా బోధపరపవలయును.

పత్రికాధిపతులు, దేశనాయకులు నీవిషయమును కొంచెము ధీరతతో నాలోచించి ప్రజలను ప్రబోధింప ప్రార్థించుచున్నాడ.

- గోపదేవ్

# జాతీయత - II
# మనమెవరము? ఆర్యులమా? హిందువులమా? హిందువులనెవరు?

నేడు భారతదేశమున సుమారు (80) ఎనుబది కోట్లమంది జనులు నివసించుచున్నారు. వీరిలో ననేక మతముల వారున్నారు. మహమ్మదీయులు, క్రైస్తవులు, జైనులు, బౌద్ధులు, పారసీకులు నను వారు సుమారుగ పది, పండ్రెండు కోట్ల సంఖ్యగలవారై యుందురు. మిగిలిన (50) ఏబదికోట్ల సంఖ్యలో నున్న జనులు తమ్ముతాము 'హిందువులము' అని చెప్పుకొనుట సామాన్యము.

మహమ్మదీయులు: వీరు ఇస్లామ్ మతమునకు చెందినవారు. ఆమతము ముహమ్మద్‌ద్వారా లోకమున వ్యాపింపజేయబడినది. అతడు అరబ్ దేశవాసి ముహమ్మద్ (14) పదునాలుగు శతాబ్దములనాటి వాడు. అతని మతమును స్వీకరించిన వారు మహమ్మదీయులనబడుదురు. వారీ దేశమునకు వచ్చి ప్రాభవము సంపాదించి యీ దేశవాసులను కొందరిని ముస్లిములుగా మార్చిరి. అటుల మార్చబడిన వారేయిప్పటి యీ దేశపు మహమ్మదీయులు. మహమ్మదీయులనగా ముహమ్మదు ననుసరించు వారని సులభముగా బోధపడును. వీరిలో కొందరు ఆ కాలమున అరబ్ నుండి ఈ దేశమునకు వచ్చి స్థిరపడిన వారును ఉందురు.

క్రైస్తవులు: వీరు క్రీస్తుమతము ననుసరించువారు. క్రీస్తు ననుసరింతురు కావున క్రైస్తవు లనబడుదురు. క్రీస్తుపాలస్తీనాలో (19) పందొమ్మిది శతాబ్దముల క్రిందట జన్మించిన వ్యక్తి. లెక్కకు పందొమ్మిదివందల యెనుబది యేండ్లనాటి వాడనవచ్చును. ఆంగ్లేయులీ దేశమును పరిపాలించు కాలమున వారు క్రైస్తవులు కావున వారి మతము నిక్కడి ప్రజల కంట గట్టిరి. ఇప్పటికిని క్రైస్తవ మిషనరీలు ఇక్కడి వారిలో దరిద్రులను ధనాది లోభములతో క్రైస్తవులనుగా మార్చుచునే యున్నారు. వారి నరికట్టు నాథుడీ దేశమున లేదు.

ఇట్లీ రెండు మతములు పరదేశముల నుండి వచ్చి యీదేశవాసుల నాక్రమించినవి.

ఇక బౌద్ధులు, జైనులు: వీరిరువురు సంఖ్యకు మిక్కిలిగా లేరు. బుద్ధ జిన శబ్దములచే జెప్పబడు సంప్రదాయ ప్రవర్తకులిరువురు ఈ దేశమున జన్మించిన మహాపురుషులే. కావున బౌద్ధ జైనమతము లీదేశ మునకు జెందినవియే. మొదట నీ రెండు మతములు నొక్కటిగానే యుండి యుండవచ్చు ననిపించుచున్నది. కారణమేమన అమరకోశమున బుద్ధ. జిన పదములు రెండును బుద్ధుని నామములుగానే పరిగణింపబడి నవి. బుద్ధుడు ఈ దేశమున జన్మించి (2500) రెండువేల యైదువందల సంవత్సరములు గడచినవి. ఈ బుద్ధుని అనుసరించువారు బౌద్ధులనియు, జిను ననుసరించువారు జైనులనియు చెప్పకొనుచుందురు.

మిగిలినవారు పారసీకులు: వీరు పార్సీ దేశము నుండి వచ్చినవారు. అందువలన పారసీకులని పిలువబడుదురు. వీరి మతము జరదుస్తునిచే ప్రారంభింపబడినది. అతడు పర్షియాలో మూడువేల (3000) సంవ త్సరములు నాటి వాడుగా నెంచబడుచున్నాడు. అతని మతము నను సరించువారీ దేశమున కొకప్పుడు వచ్చి యిక్కడ నివసించుచున్నారు. వారు తమ మతమున నితరులనుజేర్చుకొనుటకు యత్నించుచున్నట్లంతగా గోచరింపదు.

ఈ విధముగ నీ మతములను గురించి యెరిగిన మీదట నీ మతము లన్నియు మూడువేల సంవత్సరములకు బూర్వమీ ప్రపంచమున లేవనియే యెంచవలసి వచ్చును.

పైన వర్ణించిన ఈ యైదుమతములవారు కాక మిగిలిన అధిక సంఖ్యలో నుండు వారు తమ్ముతాము హిందువుల మని చెప్పకొను చున్నారు. వారిని 'మీ మతమేమి?' యని యడిగిన తమమతము హిందు మతమందురు.

పైన వర్ణించిన మహమ్మదీయాది మతములకు ముహమ్మదు, క్రీస్తు మున్నగువారు చారిత్రికపురుషులు ప్రవర్తకులుగా నున్నట్లు వారు చెప్ప దురు. వినువారికిని సందేహము కలుగుట కవకాశము లేదు. అట్లే హిందుమతమునకు ప్రవర్తకుడు మూలపురుషు డెవడైన చరిత్ర ప్రసిద్ధు

డున్నాడా? యని హిందువుల నడిగిన వారాకాశము వంక జూతురు. అనగా సమాధానము చెప్పజాలరు. హిందు వనువ్యక్తి యెవ్వడైన నుండిన గదా వారు సమాధానము చెప్పగలుగుదురు? లేదు కావున చెప్పజాలరు. హిందువులేకాదు ఏ యైతిహాసికులును చెప్పజాలరు. కారణ మేమన హిందువు అను నొకవ్యక్తి యే చరిత్రలోను ఎప్పుడును ఎక్కడను పుట్టినట్లు వ్రాయబడి యుండడయ్యె. కావున హిందువు అను నైతిహాసిక ప్రసిద్ధ పురుషుడొకడు లేడనియే చెప్పవలసి వచ్చును.

హిందు వనువ్యక్తియే లేనినాడు హిందు మత మెటనుండి వచ్చి నది? అని ప్రశ్న కలుగక తప్పదు. కారణమేమన మతమనగా నభిప్రాయము. అదివ్యక్తికి సంబంధించినది. అందువలననే యుపర్యుక్త మతములన్నియు జరదుస్తుడు, బుద్ధుడు, జినుడు, క్రీస్తు, మహమ్మదు అనువ్యక్తుల పేర్లతో వ్యవహరింపబడుచున్నవి. అవ్యక్తులను తొలగిం చిననాడు మతము మిగులును. దానికర్థమేమగును? అభిప్రాయము మాత్రము. కాబట్టి హిందువను వ్యక్తిలేనినాడు హిందుమతము వ్యర్థ మగుచున్నది. అందువలననే హిందు మతమన నేమి? యని ప్రశ్నించిన హిందువులు సమాధానము చెప్పజాలక పోవుచున్నారు.

ఇందులకు కొందరు నేటి చరిత్రలను జెప్పువారు హిందువను పదము వ్యక్తివాచకము కాదు. అది దేశవాచక మను చున్నారు. ఏదేశమునకు పేరనిన, పూర్వమనగా నీ దేశమునకు పారశీకులు రాకమునుపు ఈ దేశ మునకు సింధుదేశమని పేరుండెడిది. దానిని పారసీకులు సింధువునకు హిందువనివారు. అప్పటినుండి యీదేశము హిందుదేశమైనది హిందు దేశమున నుండు వారు హిందువులనబడినారు. వారి మతమే యీ హిందుమతమని సమాధానముగా జెప్పుదురు.

ఈ సమాధాన మెంతవరకు అంగీకార్యమో దీనిలో నెంతపస ఉన్నదో చూడవలసి యున్నది. పారసీకులిటకు రాక ముందు ఈ దేశమునకు సింధుదేశము అనినామముండి యుండవలయును. చరి త్రలో నట్టిప్రమాణ మెచ్చటను కానము. సింధునది యున్నది. కాని ఆ సింధునది పేరుతో నీదేశము సింధుదేశమని పిలువబడినట్లు ప్రమా

ణముం గాంచము. సింధుదేశమనియున్నప్పుడు ఈ దేశమున గల ప్రజలు సింధువులని పిలువబడిరా? ఇందులకేమైన ప్రమాణమున్నదా? లేదు. సింధుపదము ఒక ప్రాంతమునకు వాడబడినదా? ఈ దేశమున కంతటికి వాడబడినదా? ఇట్టి ప్రశ్నలకు చరిత్రలో సమాధానము లేపైన ఉన్నవా? లేవు.

కొందరు వేదమున 'సప్తసింధు' అను పదమున్నది. అదియే హప హిందుపె, అందలి హప్తపోయి హిందు మిగిలినదందురు. దీనికి ప్రమాణము సున్న.

దుర్జనతోషన్యాయము ననుసరించియో, అభ్యుపగమ సిద్ధాంతము ననుసరించియో కొంచెము సేపు ఈ దేశమునకు హిందు దేశమని పేరట్లు వచ్చినదని యంగీకరించినను, దేశము పేరు దేశవాసుల కెల్లరకు వర్తింప వలయును. కాని కొందరే హిందువు లెట్లయిరి? మహమ్మదీయులు, క్రైస్తవులు బౌద్ధాదులు తాము హిందువులని యేల యంగీకరింపరు? దీనికి సమాధానమేమి? కాబట్టి సింధుదేశము హిందుదేశమగుట కాని, అందువలన హిందువులగుట కాని యేవిధముగను నంగీకరింప దగినది కాదు.

మరికొందరు 'హింకరోతి' 'దునోతి' అను రెండు పదముల అద్యక్షరములతో 'హిందు' పదమేర్పడినదనియు, అ పదము లేదో మేరు తంత్ర గ్రంథమున నున్నవనియు చెప్పుదురు. భారతీయ భాషలలో నిట్టి పదయుత్పత్తి విలక్షణముగానే కనిపించుచున్నదే కాని సహజముగాలేదు. అట్టి పదముత్పన్న మైనదని యంగీకరించినను దాని యర్థమేమగును? అట్టి యర్థరహితమైన పదమీ దేశపు ప్రజలేల వ్యవహరింప బూనిరి? వారికింత కంటె మంచి యర్థముగల పదము దొరకలేదా? ఈ దేశపు భాషలకట్టి దారిద్ర్యమెన్నడు కలిగినట్లూహింపజాలము.

సంస్కృత భాషకు సంబంధించినంత వరకు, వైదిక సాహిత్యమున నీపద మెక్కడను వేదములందు బ్రాహ్మణములందు ఉపనిషత్తులందు, అరణ్యకములందు నెచ్చటను మచ్చునకైనను కానరాదు. లౌకిక సాహిత్యమునందును సూత్రగ్రంథములందుగాని, స్మృతులందుగాని, భారత భాగవతములందు కాని, పురాణములందుగాని, ఈ పదము కనిపిం

పదు. వెయ్యి యేండ్లకిటీవల వ్రాయబడిన సంస్కృతాంధ్ర గ్రంథము లలో తప్ప ఇతర గ్రంథము లందెక్కడను హిందు పదము వాడినట్లు చూడజాలకున్నాము. కాబట్టి యీ 'హిందు' పదము భారతీయభాషలకు సంబంధించినది కాదని నిర్ణయించుట కెట్టిపోనియు కనిపింపదు.

అటులయిన నీ పద మేభాషకు సంబంధించినది? అను ప్రశ్నము దయించును. విచారింపగా నీ పదము పర్షియన్ భాషకు జెందినదని తెలియుచున్నది. ఆ భాషకు సంబంధించిన కోశమునందు 'హిందు' అనగా డాకూ, చోర్, బద్మాష్, గులామ్, కాలాఆద్మీ, కాఫీర్ అని అర్థములు చూడనగుచున్నవి. ఇట నీయర్థములతో నేమి ప్రయోజనము సిద్ధింపగలదు? అని పాఠకులకు సందియము వొడమును.

ఈ దేశము ప్రాచీన కాలమునుండియు జంబూద్వీపము, భరత వర్షము, భరత ఖండము, ఆర్యావర్తము అను పేర్లతో వ్యవహరింపబడు చుండెడిది. ఇందులకు ఈ దేశవాసులు తామాచరింపబోవు శుభకార్య ముల నారంభించుచు సంకల్పము చెప్పుకొను నాచారము సర్గాదినుండి వచ్చుచున్నది. ఈ దేశము హిందూ దేశముకాదనుటకు అసంకల్పమొక ముఖ్య ప్రమాణము. సంకల్పము:- "ఓం అద్యబ్రహ్మణః ద్వితీయ ప్రహ రార్థే, శ్వేతవరాహకల్పే, సప్తమేవైవస్వతమన్వంతరే, అష్టావింశతితమే కలియుగే ప్రథమచరణే జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోః దక్షిణదిగ్భాగే. ఆర్యావర్తే, పుణ్యభూమౌ, మహాజనసన్నిధౌ, అస్మిన్ వర్తమాన.......... ఏవంగుణ విశేషణ విశిష్టాయాంతిథౌ "ఇత్యాది"

ఈ సంకల్పమున హిందు దేశపదము కనబడదు. అట్టి యీ యార్యా వర్త దేశమును లేక భారతదేశమును ఆర్యసార్వభౌములు సర్గాదినుండి పరిపాలించుచు వచ్చిరి. కాలముగతింపగా నొక వేయి సంవత్సరములకు పూర్వ మీ దేశమును మహమ్మదీయు లాక్రమించి యెనిమిది వందల యేండ్లు పరిపాలించి యుండుట చరిత్ర ప్రసిద్ధ విషయము. అరబ్ దేశము నుండి వచ్చిన వీరు తమ రాజ్యమునిట స్థిరపరచు కొనుటయే కాక, యీ దేశపు ఆర్యులను ముస్లిములుగా మార్చ నారంభించిరి.

విజేతలు తమచే పాలితులగు ప్రజల మతమును మార్చి తమ మతము

వారి కంట గట్టుట సహజము. మతమేకాదు భాష, వేషము, ఆచారములు నన్నియు మార్చి, తన్మూలమున తమ రాజ్యము విజిత దేశములందు స్థిరపరచుకొన యత్నించుట బుద్ధిమంతుల పని. ఇట్లు మహమ్మదీయులు తమ మతము నీ దేశవాసుల కంటగట్టి యెంద రినో మహమ్మదీయులుగా మార్చుకొనిరి. అట్లు మారని వారిని పావులు, దుష్టులు, కాఫిర్, అను నర్థముగల హిందు పదముతో బిలువ నారం భించిరి. ఈ విధముగా నీ దేశవాసులను - ఇస్లామ్‌ను అంగీకరింపని వారిని 'హిందు' పదముతో పిలుచుచు వారికీ హిందు పద మంటగట్ట బడినది. కావుననే నేడును ముస్లిములు హిందువులను కాఫిరులని వ్యవ హరించుట సాధారణమైనది. బహుకాలము వారిరాజ్యమిట వ్యాపకముగా నుండుటం బట్టి ప్రజలు గత్యంతరము లేక హిందువులని వ్యవహరింపబడిరి. ఇస్లామును గ్రహించిన బడుగు ప్రజలు ముస్లిములయిరి. గ్రహింపని వారు హిందువులనబడిరి. ప్రథమమున నీ పదము నంగీకరింపక పోయినను ప్రభుత్వమునకు లోబడి క్రమముగా నంగీకరింపక తప్పనిస్థితిలో ఆర్యులు వైదికులు తమ్ముతాము హిందువులని వ్రాయుటకు, చెప్పుకొనుటకు నంగీక రించి యుందురు. ముస్లిము లెంత ప్రయత్నించినను నిటనుండు నార్యుల నెల్లరను తమ మతమున జేర్చుకొన జాలకపోయిరి. కొలదిమందియే లోబడి యుందురు. లోబడని వారిని హిందువులనుటయే కాక యీ దేశమును మొగలాయి చక్రవర్తులు 'హిందుస్థాన్' అనియు వ్యవహరింప సాగిరి. ఈ విధముగ నీ దేశవాసులను హిందువులని, వారి దేశమును హిందుదేశమని నారేకాని, దేశము హిందు దేశమగుటచే నటనుండు వారు హిందువు లయినారనుట స్వాభావికము కాదు. దుష్టార్థమున హిందు పద మిటనుండు వారికి బలవంతముగా రుద్దియుండుట చేతనే మహమ్మదీయులు తమ్ముతాము హిందు పదముతో పిలువబడ నంగీకరిం పరు. దేశవాచకమే యైయున్న వారి కభ్యంతరమేల యుండును. కాబట్టి హిందు పదము ప్రాచీన భారతీయ భాషలలోను ముఖ్యముగా ప్రాచీన సంస్కృత సాహిత్యమునందును నెక్కడను కనబడకున్నది.

భగవద్గీత యందు యుద్ధవిముఖుడైన అర్జునుని మందలించుచు కృష్ణుడు 'అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికరమర్జున' అనివాడి యున్నాడు. హిందు పదమిట నుండు వారికి వాచకమై యుండి యున్న "అ

హిందు జుష్టమ"ని వాడి యుండ వలసినది. అట్లు వాడక అనార్య జుష్ట మనుటలో నిటనుండు వారు అర్యులనబడుచుండెడివారనియు, వారిలో నిట్టి, కశ్మలముండదగినది కాదనియు స్పష్టము చేయుటకే వ్యాసుడు కృష్ణునిచే అ హిందుజుష్టమనిపింవక అనార్య జుష్టమని మందలింప జేసినాడు. భగవద్ గీత పరమోత్తమ గ్రంథముగా నెంచు హిందు పౌరాణికులకు, ఈ దేశమున నుండు వారు అర్యులేయనియు హిందు వులు కాదనియు, తాము ఆర్యసంతతికి చెందిన వారనియు చెప్పుకొనుట కింతకంటె నుత్తమ ప్రమాణమేమి కావలయును? పౌరాణికులు తామా రాధించు రామకృష్ణాది మహాపురుషులు. అవతారములు హిందువులం దురా? ఆర్యులందురా? తాము స్వయముగా హిందువులా? ఆర్యులా? తమమతము హిందుమతమా? వేదమతమా? పురాణమతమా? తాము అర్యులా? అనార్యులా? కృష్ణుడు అర్యుడా? హిందువా? అలోచించి సమాధానము చెప్పుదురుగాక!

ఈ దేశవాసులు పూర్వమెన్నడు హిందువు లనబడలేదనుటకు మరి కొన్ని ప్రమాణములు:-

1. క్రీ.శ. 7వ శతాబ్దమున ఇత్ సింగ్ నామముగల చైనా యాత్రికుడీ దేశమునకు వచ్చియుండెను. అతడు ఈభారత వర్షమునకు అర్యదేశమని నామము నాడు వ్యవహరింప బడుచున్నట్లు వ్రాయుచు నిట్లు పలికియుండెను. "ఉత్తరదిశకు చెందిన జాతులు (హూ-మొగలులు మరియు తురుష్కులు) మాత్ర మీ యార్య దేశమును హిందూ దేశమని చెప్పుచున్నవి. కాని యీ నామము ప్రచలితము కాదు. భారతీయులకు ఈ 'హిందూ' నామము ప్రాయః అపరిచితమై యుండెను. ఇంతేకాక భారత దేశమునకు అన్నిటికంటె సరియైన నామము "అర్యదేశమే" అని తనలేఖలో నిర్దేశించి యున్నాడు.

2. క్రీ.శ. 1870 (వి.శ. 1927) శ్రావణ బహుళ పాడ్యమి నాడు వారాణసీ - కాశీనివాసులు (46) నలువది యార్గురు ప్రసిద్ధ పండితులు కలిసి యొక వ్యవస్థాపత్రమును ప్రకటించుచునందు "హిందూ పదము మన నామము కాదు" అని స్పష్టపరచియున్నారు. ఈ ఘోషణ

పత్రము క్రింద హస్తాక్షరములు చేసిన వారిలో చిట్టచివరి పండితుడు - పండిత దుర్గాదత్తుగారు. వారు "హిందూ శబ్దోహి యవనేష్వధర్మిజ నబోధకః" 'హిందుశబ్దము యవనులలో అధార్మికుడైన వానిని తెలుపు పదము' అని సంస్కృతమున నిబంధించి యున్నాడు 'అంతే కాక శ్లోకములో నుత్తరార్ధమున

'అతోనార్హన్తి తచ్ఛబ్దబోధ్యతాం సకలాజనాః'

'కావున సకల జనులు ఆ 'హిందూ' శబ్దముచే చెప్పబడదగిన వారు కారు' అని వ్యవస్థ చేసియున్నారు. మరియు నీ వ్యవస్థా పత్రము క్రింద సంతకము చేసిన వారిలో 'శ్రీ స్వామీ విశుద్ధానంద సరస్వతీ గారు, శ్రీ పం. బాలశాస్త్రి గారు మిక్కిలి ముఖ్యులే కాక. ఆ దినములలో ఆర్య నామమును పునరుద్ధరింప సమకట్టి ఆర్యసమాజ సంస్థాపకులైన శ్రీమద్దయానంద మహర్షి కత్యంత విరోధులై యుండిరి.

3. హరిద్వారమునగల సంస్కృత మహా విద్యాలయాధ్యక్షులుగా - ముఖ్యాధ్యాపకులుగా పలువర్షములు పని చేసిన మహాపండితుడు స్వ. పండిత నరదేవశాస్త్రిగారు తమనిశ్చయము నిట్లు తెలిపి యుండిరి. "మేము సంస్కృత సాహిత్యమున 'హిందూ' శబ్దమును కనుగొనుటకు ప్రబల ప్రయత్నము చేసి యుంటిమి. కాని యది ప్రాచీన సాహిత్యమున లభింపదయ్యె. చిట్ట చివరకు అన్వేషింపగా అన్వేషింపగా ఏడువందల సంవత్సరములనాడు వ్రాయబడిన కాశ్మీరపు రాజతరంగిణిలో హిందు శబ్ద ప్రయోగము చిక్కినది కాని యింతకు పూర్వపు సాహిత్యమున కనుగొనజాలక పోయితిమి".

ఉపర్యుక్త ప్రమాణములనుబట్టి హిందూ శబ్దము ప్రాచీన సాహిత్యమున (భారతీయ భాషలకు సంబంధించినంత వరకు) లభింపదనుట నిశ్చిత సిద్ధాంతమనియే చెప్పవలసి వచ్చుచున్నది. కావుననే హిందువులని నేడు పిలువబడువారు ఆపదమున కొక యర్థము చెప్పజాలకున్నారు. హిందువే లేనపుడు హిందూమత మెక్కడిది? అందు వలననే హిందూమతమననేమి యని ప్రశ్నించిన పలువురు మౌనము వహింతురు. కొలదిమంది కొంచె మాలోచించు వారు హిందూ మతమన వైదిక

మతము లేక ఆర్యధర్మము అనినుడువుదురు. కావున నేటి హిందువులు పూర్వము ఆర్య పద వాచ్యులై యుండిరనుట నిశ్చితము. మన దేశము స్వతంత్రమైన పిమ్మట హిందువులమని పిలువబడు మనము 'ఆర్యులము' అనికాని, 'భారతీయులము' అనికాని, పిలుచుకొనుట సమంజసముకాదా? ఇందు అనౌచిత్యమేమున్నది.

ఇక ఆర్యశబ్దము 'ఋ=గతౌ' అనుధాతు మూలకము. దానికి మంచి వాడు, పూజ్యుడు, ప్రగతిశీలుడు మున్నగు నర్థము లుండుట యెల్లరెరిగిన విషయమే. వేదములు మొదలు రామాయణ భారతాది సంస్కృత గ్రంథములలో నీ దేశవాసులెల్లరు ఆర్యపదముతో వ్యవహరింప బడుచు న్నట్లు చూచుచున్నాము. "కృణ్వన్తోవిశ్వమార్యమ్" అను వేదవచనము నేటి ఆర్యసామాజికుల కొక నినాదమై యుండుట నిత్యము వినుచునే యున్నాము. ఇది యిట్లుండ నేడు మన దేశమున సుమారు రెండు దశాబ్దముల నుండి 'విశ్వహిందూపరిషత్' అను నొక సంఘ మేర్పడి 'హిందూ' శబ్దమును బల పరచుచు అనేక సంప్రదాయముల రూప మున ఛిన్నాభిన్నమై యున్న వైదిక ధర్మావలంబుల నేక సూత్రమున బంధింప ప్రయత్నించు చుండ జూచుచున్నాము. వారెంతగా సఫలతను సంపాదించుచున్నారో వారికే తెలియును. వారు తమ పరిషన్నామ మును నిర్ణయించుటకు పూర్వము హిందూ పదార్థ వైలక్షణ్యమును గూర్చి బాగుగ విచారించియు, దానికొక విశిష్టార్థము సర్వజనాంగీకార యోగ్యమైనది కానక పోయినను ఆ పదమునందున్న వ్యామోహమేమో దానిని విడువజాలక, తమ సంఘమునకు 'విశ్వహిందూ పరిషత్త' ని నామకరణము చేసికొని ప్రచారము చేయుచున్నారు. వారు హిందూ పదమునకు క్రింది యర్థమును ప్రత్యేకముగా వ్యవహరించుచున్నారు.

"భారత ఖండమునందు ఉద్భవించిన నైతిక ఆధ్యాత్మిక శాశ్వత మూల్యములను విశ్వసించు లేదా గౌరవించు వ్యక్తి మరియు తనను హిందువుగా వ్యవహరించుకొను మరి యెవరైనను 'హిందువు' అనబ డును. ఇదివారి హిందూపదనిష్కృష్ట అర్థము. ఇట్టి విశిష్టార్థమున నీ పదమింతకు పూర్వము ప్రయోగింపబడి యున్నదోలేదో సాహిత్యవిదులే చెప్పగలరు".

ఇంతటి క్లిష్టార్థమును కల్పించుకొని యీ హిందూ పదము నేల ఇంతగా పోషించుచున్నారో దురూహ్యము. హిందూత్వము పేరిట నేడు జనులలో ననేకములగు మూఢాచారములు, మూఢనమ్మకములు కుల వైషమ్యము, జడపూజలు జంతుబలులు, హిందువులలో నానాజాతీయత, పునర్జన్మతో బాటు ఔర్ధ్వదైహిక శ్రాద్ధాదికర్మలు నెన్నియో యవైజ్ఞానిక ములగు దురాచారములు ప్రబలియున్నవి. వీనిని పోషించుట హిందూ విశ్వపరిషత్తు తన కర్తవ్యముగా నెంచుచో వారికి హిందూ పదము విడు వదగినది కాదు. అన్యథా యీ మూఢాచారముల నుండి ప్రజలను దొలగించి యున్నత వైదిక ధర్మమార్గమున నడిపింప నెంచినచో హిందూ పదము వదలి ఆర్యపదమునో భారతీయ పదమునో యంగీకరించి యెల్లరను సనాతన వైదిక ధర్మపథమున నడుపుట మిక్కిలి సుకరము కాదా? ఇప్పటి ద్వైతాద్వైత విశిష్టాద్వైతాది సంప్రదాయములకు జెందిన వారెల్లరు, ఇట్లే శైవశాక్తగాణాపత్య పాశుపతాది మతావలంబులెల్లరు వేదమూలము నంగీకరించువారే కావున వారిచే నొకవైదిక పథము నవ లంబింపజేసి నేటి సంప్రదాయ భేదములను దొలగించి యొకే మార్గమున నడుపుట సులభముకాదా? విజ్ఞులాలోచింతురు గాక! నాదృష్టిలో ఆర్య సమాజ సంస్థాకులైన మహర్షి దయానంద సరస్వతీస్వామి గారు ఈ దిశలోనే ఆలోచించి ఆర్యసమాజమును నెలకొల్పి యున్నారు. దానిని విరోధించిహిందూపరిషత్తు సాధింపదలచినదేమోదురూహ్యముగ నున్నది.

- గోపదేవ్



## పండిత గోపదేవ్

జననము : క్రీ. శ. ౧౯౦౦ ప్రాంతము.

జననీజనకులు : శ్రీ అంబమాంబా రామయార్యులు.

స్థానము : కూచిపూడి, తెనాలి తాలూకా, గుంటూరుజిల్లా. 522313

విద్యాభ్యాసము : కాశ్యాది విద్యా పీఠములు, సంస్కృతాంధ్ర హిందీ సాహిత్యములు.

అభిమాన విషయములు : షడ్ దర్శనములు, నైష్ఠిక బ్రహ్మచర్యము, యోగమార్గ ప్రావీణ్యము.

వృత్తి : వైదిక ధర్మ వ్యాపకత.

రచనలు : అయిదు దర్శనములు, పదునొకండు ఉపనిషత్తులు, ఆస్తిక వాదము, ఆర్ష ధర్మ మీమాంస, శ్రీమద్భగవద్గీత, ఋగ్వేదాది భాష్యభూమిక, సత్యార్థ ప్రకాశము, షోడశ సంస్కారవిధి మొదలైనవి

# డా॥ పండిత గోపదేవ్

జననము : క్రీ.శ. 1900 ప్రాంతము

జననీజనకులు: శ్రీ అంబమాంబా రామయార్యులు

స్థానము : కూచిపూడి, తెనాలి తాలూకా

వృత్తి : వైదిక ధర్మ వ్యాపకత

రచనలు,

అనువాదములు: న్యాయ – వైశేషిక – సాంఖ్య – యోగ – వేదాంత దర్శనములు, ఈశ – కేన – కఠ – ప్రశ్న - ముండక – మాండూక్య ఐతరేయ – తైత్తిరీయ - శ్వేతాశ్వతర – ఛాందోగ్య – బృహదారణ్యకోపనిషత్తులు, అస్తికవాదము, అర్థ - ధర్మ మీమాంస, పంచమహాయజ్ఞవిధి, శ్రీమద్ భగవద్గీత, ఋగ్వేదాది భాష్యభూమిక, ఏసుక్రీస్తు రహస్య జీవనము, సంస్కారవిధి, ఋగ్వేద భాష్యభాస్కరము 1,2,3, – వైదిక పర్వ పద్ధతి, అపశూద్రాధికరణము మొదలగు చిన్న పుస్తకములు 25, సత్యార్థ ప్రకాశము, నిరుక్తము etc.